# శ్రీ శంకరసద్గురు

# ప్రబోధసుధాకరము


అనువాదకురాలు:

కీ. శే. కాళ్లకూరి మహాలక్ష్మీసుందరాంబ

ఎం. ఏ., (డబుల్) యల్. టి.



ప్రకాశకులు:

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము,

బెజవాడ.

1942

# ప్రబోధసుధాకరము

(తెలుగు)

శ్రీమతి కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మ
ఎం. ఏ., (ఆనర్సు) యల్. టి.



కీ. శే. శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మీసుందరాంబ,

డబుల్ ఎం. ఏ. యల్. టీ.

శ్లో॥ శ్రుతౌ రక్తిః పతౌ భక్తి రాసక్తి ర్గురుసూక్తిషు।

విరక్తి రింద్రియార్థేషు మహాలక్ష్మ్యా మహాగుణాః॥

# శ్రీ ప్రబోధసుధాకరము

## ప్రకాశకుల ప్రకటనము

ఈ గ్రంథమందుఁ బ్రధానమగు విషయము శ్రీశంకర భగవత్పాదవిరచితం బగు "ప్రబోధసుధాకరం"బను భక్తి కావ్యము. ఇం దాచార్యులవారు సగుణనిర్గుణభక్తుల కైక్యము నిరూపించియుండుటచే నిది గొప్ప సమన్వయశాస్త్రమన వచ్చును. శ్రీమద్భాగవత ప్రతిపాదితమైన కృష్ణతత్త్వము కర తలామలకముగాఁ బ్రబోధసుధాకరంబునఁ బ్రతిపాదింపఁబడినది. అద్వైతము గురుదేవభక్తిసాధ్య మని యింత లలితముగా నెందును నిరూపింపఁబడలేదు.

కీ. శే. మహాలక్ష్మీసుందరాంబగా రీ గ్రంథరాజమును సుకుమారబుద్ధులకు శ్రద్ధాభక్తియుక్తులగు ముగ్ధలకుఁ దారక ముగా నెంచి యథామతిఁ జక్కని త్రిలింగపదబంధమునఁ గూర్చిరి. ఆంధ్రదేశమున నాచార్యులవారిఖండగ్రంథములంతగా బ్రచారములో లేవు. వివేకచూడామణిమాత్రము సువిదితముగా నున్నది. ప్రశ్నోత్తరరత్నమాలయు గీర్వాణవ్యాఖ్యతో నాంధ్రవివరణముతోఁ గొంత ప్రచారములో నున్నది. వాదోప వాదములతో నిండినభాష్యగ్రంథములు పండితులకుఁ బ్రమోద ప్రదములైనను శంకరులవారి ఖండగ్రంథములు భక్తబృంద మునకుఁ గైవల్యనవనీతఖండములై విలసిల్లు. శ్రీ సుందరాంబ శాంకరఖండగ్రంథముల నన్నింటినిఁ ద్రిలింగభాషలోని కనువ

దింప సమకట్టియుఁ బ్రబోధసుధాకరము - స్వాత్మప్రకాశిక - అద్వైతానుభూతి - సదాచారానుసంధానముమాత్ర మాంధ్రమున రచించి తన భౌతికశరీరమును విడిచి, బ్రహ్మవస్తువుతో నద్వైతసిద్ధిఁగాంచె. ప్రకృత మీగ్రంథమునందుఁ బ్రబోధసుధాకర మొక్కటియే ప్రచురింపఁబడియె. తక్కినవి వీలువెంట నచిరకాలములో వెలువడఁగలవు. మఱియు నీయమచే ధర్మప్రచారమునకై రచియింపఁబడిన "మహిళా మర్యాద"యను స్త్రీ ధర్మశాస్త్రగ్రంథము, కొంతవఱకే యిందుఁ బొందుపఱచఁబడియె. ఆ గ్రంథము శ్రీమతి కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారి యాంధ్రవివరణముతోఁ బ్రత్యేక ప్రతిగాఁ బ్రచురింపఁబడును. సక్తుప్రస్థుని యాగమున కనిర్వచనీయమైన రాజసూయాధికమైన మహాఫలము చేకూరి నట్లీ సుందరాంబగారి చిన్నిపౌత్రములకుఁగూడ పరమేశ్వరానుగ్రహంబున నఖండఫలము చేకూరుఁగాక! ఆసాధ్వీమణి ధర్మోత్సాహము మహిళాలోకమున కాదర్శప్రాయమై భారతవర్షమున ధర్మబీజసంరక్షణ మొనరించుఁగాక !

శ్రీ సుందరాంబగారి భర్త మహారాజశ్రీ కాళ్లకూరి శేషయ్యపంతులు, బి. ఏ., గారు (కర్నూలు మునిసిపల్ మేనేజరు) రచించిన "నా ధర్మపత్ని - దైవఘటన" యను సుపోద్ఘాతమున గల విశేషములు సహృదయు లెఱుంగఁగలరు. సాధ్వీమణికిఁ బతిమన్ననఁబొందుటకంటె నుత్తమఫలముకలదా! శ్రీ మహాలక్ష్మీసుందరాంబగారి జీవితము సర్వథా ధన్యము. విద్వాన్ కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబ

గారిచే రచింపఁబడిన శ్రీ మహాలక్ష్మీ సుందరాంబాస్మృతి కరుణారసమున కావలియొడ్డు ముట్టినది. తన తరువాత తన యంతదై మహిళాలోకమున జ్ఞానప్రచారము చేయఁగల శ్రీ సుందరాంబగారిపై జీవిత మంతయు నాధారము చేసికొన్న సాధ్వీమణి యగుటచేఁ దల్లియగు శేషమాంబగారికంటెఁగూడ నిప్పట్లు కనకాంబగారి సంతాప మధిక మేమోయని శంకింపఁదగి యున్నది.

కవయిత్రీమణి శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు మొదలగు సాధ్వీమణులు రచించిన సానుభూతిపద్యములు, వచనములు సహజ ప్రేమ భరితము లగుటచే వానిపై నభిప్రాయరచన మనవసరము.

శ్రీ పీఠజయంతిలో బ్రహ్మశ్రీ సర్వతంత్ర స్వతంత్ర పండితరాజ రాజేశ్వరశాస్త్రి(కాశి)గా రధ్యక్షు లయి యున్న మహాసభలో శ్రీ త్రిలింగపీఠ శిష్యురాలుగా శ్రీమతి కాళ్ళకూరి సుందరమ్మగారొసంగిన సంస్కృతోపన్యాసము నేటికిని విన్నవారి మనంబుల హత్తుకొని యున్నది.

"నేటివిద్యాలయంబుల చేటు లెఱిఁగి" యని కనకాంబ గారు రచించిన పద్యమునందలి యభిప్రాయము శ్రీ మహాలక్ష్మీ సుందరాంబగారు బాగుగ గురుతించిరి. స్త్రీ పురుషులేకస్థలమున లౌకికోపాధ్యాయుల యొద్ద లౌకికవిద్య లభ్యసించుటలోఁగల సహస్రదోషములు తనప్రజ్ఞాబలమునఁ బరిహరించి యాంగ్ల విద్యలోఁగల విజ్ఞానము మాత్రము స్వీకరించి, యాంగ్లనాగర

కతలోని కీడు నుజ్జగించిన మహాలక్ష్మీసుందరాంబగారి వివేకము కొనియాడఁదగినది.

ఆంగ్లవిద్య నవలంబించు సోదరీమణులకై శ్రీ సుందరాంబగారు "Danger Zones of Young Women" "యౌవతాపదపదములు" అను గ్రంథము నాంగ్లమున రచించియున్నారు. అదియుఁ బ్రచురణ కాఁదగినదియే. అమృతసందేశపత్రికలో నీ యమ రచించిన వ్యాసములయందామె ధర్మాసక్తి ప్రకటిత మగుచున్నది.

ఆంధ్రదేశపురంధ్రిరత్న మనఁదగు నీమహాలక్ష్మీసుందరాంబగారి గ్రంథము లాంధ్రలోక మాదరించి యాలాభమును బొందునుగాక.

ఇట్లు

పరిశాశకులు,

శ్రీ త్రిలింగమహావిద్యాపీఠపరిషత్.

శ్రీ భాస్కరాయనమః

# నా ధర్మపత్ని — దైవఘటన.

[శ్రీ కాళ్లకూరి శేషయ్య పంతులుగారు, బి. ఏ.,]

మదరాసు రాజధానిలో ముఖ్యముగ నాంధ్రమండల మందు శ్రీ బాలాంతరపు సుందరరామయ్య శేషమాంబగార్ల నెఱుంగనివారు లేరు. శ్రీ సుందరరామయ్యగారు గోదావరి జిల్లాబోర్డు హెడ్ గుమాస్తాగాఁ బనిజేసి విరమించి రెండేండ్ల క్రింద పరమపదించిరి. శేషమాంబగారు హిందూసుందరి యను మాసపత్రిక ముప్పదియేండ్లనుండి నిర్వహించి, విద్యార్థినీ సమాజము, మహిళావిద్యాలయ మను సంస్థలు నడపి విరమించి రను విషయము లోకప్రఖ్యాతము. వీరు తూర్పుగోదావరిజిల్లా కాకినాడ రామారావుపేట వాస్తవ్యులు. అసమాన గౌరవ ప్రతిష్ఠల నొకరికంటె నొకరెక్కుడుగ సంపాదించి యనేకుల బీదసాదలఁ బోషించి వన్నెకెక్కిన యీ దంపతులకుఁ బరమే శ్వరుఁడు చిరకాలమునకుఁగాని సంతానభాగ్యము కలుగఁ జేయలేదు. శ్రీ శేషమాంబగారికి నలుబది వర్షముల ప్రాయ మున నొక పుత్త్రికమాత్రము ప్రసాదింపఁబడెను.

ఆనందనామ సంవత్సర కార్తికబహుళ విదియ మహా లక్ష్మీసుందరాంబ జన్మదినము. చెన్నపురి ప్రసూతి వైద్య శాలలోఁబుట్టిన యాబిడ్డ యుండవలసిన తూకమునకు మూఁడు

పౌనులు తగ్గియుండుటచే గాజుపెట్టెలో నుంచి దానిలోనికి గాలి విడుచుచు మెత్తనిపానుపుపై గొన్ని మాసములు పెంచిరి

తల్లియైన శేషాంబగారి బహిఃప్రాణ మగు సతి మాడభూషి చూడమ్మ గారీ పసిపాప నతిప్రీతితోఁ గన్న తల్లికంటె నెక్కుడుగాఁ బదిసంవత్సరములు పెంచెను.

మాటలు వచ్చినప్పటి నుండి తమ తల్లిగారికిఁ బర మాప్తురాలైన కాంచనపల్లి కనకాంబగారి సూచనపై బొమ్మలు చూపి రామాయణ భారత భాగవత కథ లన్నియు నీ బిడ్డకు చూడమ్మగారు చెప్పి మజిల నామెచేఁ జెప్పించు చుండెడివారు.

చెన్నపురిలో నీబిడ్డ పుట్టిన పదునెనిమిదవనాడే తలి దండ్రులు బిడ్డతోఁ గాకినాడ వచ్చిరి. ఇంత కాలమునకు వచ్చిన కానుపగుటచే శేషమ్మగారి చెలికత్తెలు వందలుగా నామెను బహుమతులతోఁ జూడవచ్చిరి. బిడ్డకు నాలుగవయేడు వచ్చి నంతనే సుందరరామయ్యగారు తిరిగి చెన్నపురములో తమ కాపురమును బెట్టిరి.

బాల్యమందు వచ్చిన పలురకముల ఘోరములకు నపుడు చెన్నపురిలో ఘనవైద్యము సేయుచుఁ బ్రతిష్ఠగా నున్న డాక్టరు దంటు సుబ్బావధానిగారు తమ యమృత హస్తముతోఁ బ్రతిక్రియలు సేయుచుండిరి.

తమ ముద్దుపట్టిచే గొప్ప చదువుఁ జదివింపవలె నను కోరికతోఁ దల్లిదండ్రులు మహావిదుషీమణియుఁ గవయిత్రియు

యోగినియు నగు శ్రీకాంచనపల్లి కనకాంబగారిచేఁ దమబాల కక్షరాభ్యాసము సేయించిరి.

కనకాంబగారి సోదరీమణి పంగనామముల యమ్మ ణ్ణమ్మగారి యొద్ద లేడీవిల్లింగ్‌డన్ హైస్కూలులో సుందరి మూఁడవ తరగతి వఱకుఁ జదివెను.

తొమ్మిదేండ్ల ప్రాయమున 1923 కాకినాడ కాంగ్రెసు మండపమునఁ బ్రథమ ప్రార్థనచేయు బాలికలందఱిలో లీలగాఁ బాడుచు సంతోషమున బంతివలె నెగురుచు నీ బాలిక తల్లి గారిచే స్థాపింపఁబడిన విద్యార్థినీ సమాజమునకు, సంస్కృతపాఠశాలకు దాదాపు రు 50 ఏబది రూపాయలచట సమావేశమైన ప్రతినిధులవలన వసూలుచేసినది.

ఈ యేకపుత్త్రికయే సుగుణవతియు సౌందర్యరాశియు నిరాడంబర నిరభిమానజీవియు నైన కాళ్లకూరి మహాలక్ష్మీ సుందరీదేవి. తలిదండ్రులు విద్యాభిలాషులు, సంస్కృతాభిమానులగుటచేఁ దమ కుమార్తెను చిన్ననాటనుండియు, విద్యాసక్తగాఁ జేసి సద్యశస్కను జేసిరి. మాతండ్రిగారు నన్ను విద్యాభ్యాసమునకై కాకినాడ బాలాంతరపు వారియింటికిఁ బంపిరి. శేషమ్మగారు మాయమ్మగారి మేనత్తకూతురు. నేను వారింట నుండియే, ఎఫ్. ఏ. బి. ఏ; చదివితిని. అప్పటికి నా వయస్సు ఇరువదివత్సరములు. శ్రీమతి మహాలక్ష్మీసుందరమ్మకు పండ్రెండు వర్షముల ప్రాయమునుండి నే నామె నెఱుంగుదును. సంపన్నులెందఱు తమ కుమారులకై తన్నడుగ వచ్చినను శ్రీమహాలక్ష్మీసుందరీదేవి నన్నేకాని యన్యుల నొల్లక కల్యాణ

కాలమునకై ప్రతీక్షించుచుఁ దరువాతఁ గొంత కాలమునకు నన్నే పెండ్లియాడినది. ఈ యాలస్యము తల్లిదండ్రుల సంస్కార ప్రియత్వమునకుఁ దోడుపడినది. మమ్మెఱింగిన వారంద ఱిది యాదర్శప్రాయ మగు వివాహమని కొనియాడిరి. మహాలక్ష్మసుందరి తల్లిదండ్రుల ప్రోత్సాహమున మఱి యితర వాతావరణమున చక్కగా సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు నభ్యసించుచుండెడిది. ఈమె సహపాఠకురాండ్రతోఁ బాడుచు నాడుచు నుండెడిది. సహజసౌందర్యముచే వెలుఁగుచున్న యీమెకు పరమేశ్వరుఁడు మంచి మేధ నొసంగియుండెను. సంస్కృతములో మేఘదూత కావ్యమును, హిందీలో రాష్ట్రభాష గ్రంథములును, ఇంగ్లీషునం దయిదవ ఫారము పుస్తకములును చదువుచుండెడిది. ఎట్టి శ్లోకమునైన నవలీలగ చదివి యర్థముచెప్పెడిది. ఇందలి ప్రావీణ్యము కని విని యెఱింగినవా రెఱుంగదగినది. ఈమె బహుశ్రావ్యముగఁ జదువు శ్లోకములు విన్న నపరసరస్వతియా యనిపించెడిది. ఈమె 14 (పదునాలుగు) సంవత్సరముల ప్రాయమువఱకు శ్రీ కాకినాడ విద్యార్థినీ సమాజమువారిచే స్థాపింపఁబడిన మహిళా విద్యాలయమున సంస్కృతము నభ్యసించి "సాహిత్య శిరోమణి" "ఎంట్రన్సు"[Entrance] పరీక్షపూర్తిచేసినది. హిందీలో రాష్ట్రభాష కూడ ప్యాసయినది. అనంతరము బెనారస్ యూనివర్సిటీకి ప్రైవేటుగా స్కూలుఫైనలుకు కట్టి యుత్తీర్ణురాలైనది. ఇంటరుక్లాసుకూడ కాశీ యూనివర్సిటీలో ఉత్తమ తరగతిలో నుత్తీర్ణురాలైనది. అప్పుడీమెకు తోడునీడయై

కాపాడిన మాడభూషి చూడమ్మగారికి వందనము లర్పింప కున్నఁ గృతఘ్నుఁడను.

నేను సామాన్య కుటుంబమునుండి వచ్చినవాఁడను. ఉన్నత సంబంధములు,జమీందారీలు నొల్లక ప్రాతచుట్టమును, బి. ఏ ప్యాసయినవాఁడను, తన్నుఁ బ్రేమించిన కరణము బిడ్డను నన్ను నా భావ మెఱింగి వరించిన యీ సుందరి శీలము మిక్కిలి ప్రశంసనీయము. ఇందే యీమెయొక్క మనోధైర్యము, నిరాడంబరత్వము వెల్లడియగుచున్నవి. ఈమె యిష్టానుసారముగఁ దలిదండ్రులు నాకిచ్చి వివాహము గావించిరి. ఇందులకై బంధువులవలనఁ దన స్నేహితులవలన వచ్చిన కష్టముల నెన్నిటినో యోర్చిన శాంతఖని యగు శేషమాంబగారికిఁ జేతులు జోడించి హృదయపూర్వకముగ నమస్కరించుచుంటిని.

నేను బి. ఏ. ప్యాసయిననాటి నుండియు, వృద్ధులు నా యత్తమామలు నా యుద్యోగమునకై పడినపాట్లు దేవునికే యెఱుక. అల్పసంతోషులు వారు. మమ్ముల నిరువురను జూచి బ్రహ్మానందముఁ బొందిన వృద్ధు లిరువురయందును, నిష్కల్మష చిత్తులు, నిరాడంబరులుఁ బరోపకారపారీణులు నగు శ్రీ సుందరరామయ్య మామగారు పరమపదించిరి. నేనన్న వారి కమితానురాగము. పుత్త్రికకంటె నన్నెక్కుడుగ నాదరించెడివారు. మహాలక్ష్మీసుందరమ్మను తండ్రిగా రామె బాల్యమున "నానీ! మద్రాసు రాజధాని కాలేజిలో బి. ఏ. ఆనర్సు చదువవలెనురా నీవు" అని ముద్దులాడు చుండెడివారు.

అక్లే పితరుల యాశీర్వాచనముచే నిరువది రెండువర్ష ముల ప్రాయముననే ఆనర్సుకోర్సు పూర్తి చేసినది. అందు ద్వితీయ కక్ష్యలో నుత్తీర్ణయైనది. తండ్రిగారు సంస్కృతాభిమానులగుటచే బాల్యమునుండి సంస్కృతమందు కృతపరిచయురాలైనది. సంస్కృతము బి. ఏ. ఆనర్సునందు కృతార్థతం జెందిన యాంధ్రరమణీమణి వేరొకర్తు లేదు. ఈ కృతార్థత యీమెయొక్క బుద్ధివైశద్యము, విచక్షణ, సమర్థత, గ్రహణశక్తి చాటుచున్నది. ఉపాధ్యాయులకు మిత్రులకు బంధువులకుం గల విశ్వాసమును ధృవపఱచినది. అప్పటికే యీమె చరిత్ర యందు మార్పుకల్గెను. బి. యే. ఆనర్సు చదువు చుండఁగా భాగ్యవశమున శ్రీ కాంచనపల్లి కనకాంబగారి పపర్య యీమెకు కల్గెను. సజ్జనసాంగత్యమునను సహజగుణ సంపదవలనను ఈమె తన వేషభాషల యందు నాచారసంపదల యందు సంఘమర్యాదావలంబనమునందు పెద్దలయెడ గౌరవముచూపుట యందు హూణవిద్యాసంపర్కము గల యితర హైందవబాలికలవలె నిర్లక్ష్యభావములు లేక, వికృతవేషములు లేక పురాతనకాలపు పైచదువరాండ్రవలె సంచరించుచు సజ్జనలోకమునకు సన్మానపాత్రురాలయ్యెను. ఆఙ్గ్లవిద్యాభ్యాసము, సంస్కృతపఠనము నీమెను వికృత వేషములకుం ద్రిప్పలేదు. ఆ వాలుజడలు, ఆ కర్ణకంకణములు, ఆ కట్టుబొట్లు, విలాసములు, వేషభాషలు నీమె నావహింపలేదు. ఏదోయొక పల్లెటూరి సోమిదేవమ్మవలె తన చదువు ధోరణి సద్గ్రంథ కాలక్షేపములలో మున్గియుండెడిది. ఈ

విద్యాభ్యాసకాలమునందే గురుకులవాసము కూడ సలిపి కఠిన
తమ పరీక్షలయం దారితేరి నెగ్గి పాత్రురాలయ్యెను. అందుగల
దృఢచిత్తత భక్తివిశ్వాసములు కడుముదావహములు.

ఇట్టి యసమానచరిత గల యీమెకు భగవంతుఁడారో
గ్యమును బ్రసాదింపలేదు. సంవత్సరమున కాఱుమాసముల
లెక్కచొప్పున నీమె జ్వరపీడితగాని, మఱి యితర వ్యాధిపీడిత
గాని యగుచుండెడిది. అయినను గార్యదీక్ష పట్టుదల శ్రద్ధా
భక్తులు గలదియగుటచే నపారముగఁ జదివి విద్యాగంధమును
వెదజల్ల నిశ్చయించినది. క్రీ॥ శ॥ 1937వ సం॥లో బి. ఏ.,
ఆనర్సు కోర్సు పూర్తియైనవెంటనే సెంటుథెరీసా గరల్సు
హైస్కూలు హెడ్‌మిస్ట్రెస్‌గా నొకటిన్నర సంవత్సరములు
పనిచేసి బాలికలకుఁ దోడి యుపాధ్యాయలకు మిక్కిలి ప్రీతి
పాత్రియయ్యెను. ఆ సౌజన్యము సౌమనస్యము వెదకిచూచిన
మఱెట్టి వారియందును గానరాదు. ఆదర్శకోపాధ్యాయినియై
యుండెడిది. ఆకాలమునందే యీ పిన్నవయస్సులో 1-11-38 వ
తేదీన యీ యమ ఏలూరులోనున్న ప్రార్థనా సమాజవార్షి
కోత్సవమున కధ్యక్షురాలుగ నాహ్వానింపఁబడెను. ప్రైవేటు
పాఠశాలలయందు పని చాలించి ఎల్. టి పరీక్ష యీమరు
సటి వర్షమునందు అనఁగా 1938 వ సం॥లో తన శ్రేయోఽభి
లాషిణియైన శ్రీ కాంచనపల్లి కనకాంబగారి ప్రోత్సాహ
మున నుత్తీర్ణయై మేరీరాణీ కళాశాలలో ( Queen Mary's
College) నాంధ్రోపన్యాసకురాలగు శ్రీ కనకాంబగారి స్థాని
యురాలుగ 1940 వ సం॥ సెప్టెంబరు మొదలు ఆరుమాస

ములు పనిచేసినది. తన తండ్రి చిన్ననాఁడు "మాయమ్మాయి యే పాఠశాలయందు నుద్యోగముచేయదు. మేరీరాణి కళాశాలలోనే పనిచేయును, లేదా యింటియొద్దనుండి గ్రంథములు వ్రాయు" ననుచుండెడివారు. ఆ యాశీస్సు సఫలమైనది. కాని యీ మనోరథము నెఱవేరఁజూచుభాగ్యము తండ్రిగారికి లేక పోయెను. వారు 1939 వ సం॥ మార్చి 12 వ తేదీన తమ డెబ్బది నాలుగవయేట దివంగతులైరి. హిందీ రాష్ట్రభాష, సంస్కృత నాటకాంత సాహిత్యము, కౌముది, ప్రకరణములు, సంస్కృత ఎం. ఏ., ఎల్, టి,. డిగ్రీలతోఁ దృప్తినొందక 1940 వ సం॥రములో మఱలఁ దెలుగు ఎం. ఏ., చదివి కృతార్థతం జెందినది. ఈమెకు విద్యాపిపాస యింతింతని చెప్పనలవి కాదు. గ్రంథములలో మునిఁగి విశ్వము మఱచి పోయెడిది. ఈమెను బాల్యమాదిగఁ బెంచిన శ్రీమాడభూషి చూడమ్మగారు వ్రాసిన పద్యములు తార్కాణము.

తన గురువులను బీకమును గూర్చి యీమె వ్రాసిన శ్లోకములు తత్ప్రమాణబుద్ధి అంతఃకరణశుద్ధి దృఢవిశ్వాసమును జాటుచున్నవి.

విద్యాభ్యాసకాలమున శ్రీ కనకమ్మగారివద్ద జీవయాత్రాది గ్రంథస్థరహస్యములను నేర్చుకొనుచు (త్రిలింగ విద్యాపీఠమున) ప్రాచీనాచార పద్ధతులను సద్ధర్మాచరణమును విన మ్రతయు నలవరచుకొన్నది.

నేను పూర్వాచారపరాయణుఁడను. సంఘసంస్కారమం దంత యాదరము కలవాఁడనుగాను. అట్టి నాయాశయము

లను సుందరి యెఱుంగును. బాల్యమునుండి మే మిరువురమును సదా ప్రాచీనపద్ధతుల ఆధునికాచారములను దర్శించుచు కొనుచుండెడివారము. కాని మహాలక్ష్మి నాతో నేకీభవించి తన దృక్పథము మఱలించుకొనెడిది. ఇంతయేల? సజ్జనసాంగత్యమునం దన మాతృదేవియగు శ్రీ శేషమ్మగారిని ప్రాచీనాచార పరాయణగా మార్పంగల్గిన దీమెయే. శేషమాంబగారు మహిళాలోకమునకుం జేసినసేవ వారి సంఘసంస్కార పిపాస, లోకమునకు విదితమే. మహాలక్ష్మి సుందరి బి. ఏ ఆనర్సు చదువుచుండంగనే సంస్కృత శ్లోకములు సునాయాసముగం గూర్చుచుండెడిది. తన పెంపుడు మాత యనందగు చూడమ్మగారు పరమపదించినపు డీమె పొందుపఱచినశ్లోకములు చదివినచో నీమె కవితాధార యసాధారణ మని తెల్లము కాంగలదు. గద్య పద్యములు రెంటియందు నీమె కవిత్వము లోకోత్తరమైనది. శ్రీమతి, కవితిలక కాంచనపల్లి కనకాంబగారి హంస విజయమును సంస్కృతములోని కనువదించినది. "మహిళా మర్యాదా"యను ధర్మశాస్త్రగ్రంథము దేవభాషలో రచించినది. ఇంక ఖండగ్రంథములు గీర్వాణమున నాంధ్రమున గలవు. ఆంగ్లమందును గొన్ని స్త్రీల కుపయోగపడునవి వ్యాసములు గ్రంథములును గలవు. క్రమముగా వెలువడంగలవు.

విద్యలలో మేటియగుటయేగాక గృహిణులకుం బరమాదర్శముగా మెలంగినది. "కార్యేషు మంత్రీ కరణేషు దాసీ" యను శ్లోక మీమెయం దన్వర్థమైన దనుటలో నతిశయోక్తి లేదు. గృహకృత్యములు తీరి తీరికగ నున్న వేళల జీవయాత్ర,

సీతారామాంజనేయము, వాసిష్ఠరామాయణము, శంకరాచార్య సద్గ్రంథములు చదివి యర్థయుక్తముగ వినిపించునది. ఆమె సాహచర్యమువలననే నాకుఁ బారమార్థిక చింత యెక్కుడైనది. ఆ సంస్కృతవాసనయే నా కబ్బినది. బంధువులలోను ఇరుగుపొరుగువారిలోను సద్గృహిణి యనిపించుకొనినది. ఆమె చుఱుకుదనము, నిర్మలత్వము, కుశాగ్రబుద్ధి, ఏకాగ్రత, కార్యనిర్వహణ శక్తిచాతుర్యము నేటికిని నాకు మఱపురావు. మఱి యవి యితరులయందుఁ గానరావు. ఆ లీలాబాలామూర్తి యంతర్హితమైనది. ఆ విలాసములు మాత్రము స్మృతిపథమున నిలిచి యెడబాయకున్నవి.

నిత్యము నుషఃకాలమున లేచి, కాల్యకృత్యములు నెరవేర్చి, స్నానజపములు నిర్వర్తించి, రెండుగంటలలో చిత్రముగ మృష్టాన్నము తయారుచేసెడిది. ఏ ప్రొద్దుచూచినను వంట శుచిగా రుచిగా మనోహరముగా నుండెడిది.

ఏమరుపాటన్నది మందునకైన నామెయందు గానరాదు. ఏ వేళను దన కృత్యములు సకాలమునకే నిర్వర్తించెడిది. బంధువర్గము వీడినను నీయిల్లాలిని జేకొని యుబ్బూఁతలూఁగి విఱ్ఱవీఁగెద ననుకొన్న నేను నేటికిట్లు విధిచేత నన్యథా శాసింపఁబడితిని.

గుణముల ప్రోవు, మూర్తీభవించిన పరాశక్తి యనఁదగు నీమె సన్నిపాతజ్వరముచే ది. 18–7-1941 వ సం॥ లో మదరాసులో గురుసన్నిధానమున 25 వర్షముల ప్రాయమున నకాల మరణమునకు గుఱియయ్యెను.

'పాపీ చిరాయుః సుకృతీగతాయు' వన్న లోకోక్తి కీమెయే నిదర్శనము.

నేటికి సరిగా సంవత్సరమైనది. ప్రతిజీవికిం బ్రయాణము జేపో మాపో సిద్ధముగా నున్నది. కాని ముందు వెన్కలు గలవు. తాను దలంచున దొకటి, దైవతంత్రము మఱొకటి. ఇట్టి సన్మాన్యచరితను స్మరించుకొని నా కృతజ్ఞతను వెలిబుచ్చు చుంటిని.

ప్రస్తుతౌన్నత్యము బాహ్యౌన్నత్యము నాసర్వస్వము మహాలక్ష్మీసుందరిది. నా ప్రజ్ఞ యేమియులేదు. పరమార్థమే శాశ్వతము. ఎంతవారలును బొమ్మలు. కర్మసూత్రమున వచ్చుచుం బోవుచు నుందురు. సర్వమును బ్రహ్మమే యను నీమె సదుపదేశమునకు మిక్కిలి కృతజ్ఞుండను. ముప్పది సంవత్సరములకు నేటికి నాకు నాటిన దా బోధము.

ఇంకను వ్రాయుటకు దుఃఖము పొర్లి పొర్లి వచ్చుచున్నది. "చచ్చిన భార్య, భర్త యెలజవ్వని వేఱొకతెన్ గ్రహించుపో ముచ్చట దీరంగా మఱచుం బూర్వసతీమణిని"

అను జనసామాన్యపు నుడి నా పట్ల విపరీతముగా నున్నది. Charms strike the sight but merit wins the soul) అని పోపు మహాశయుం డనియుండెను. ఈమెనా దృష్టిని యాత్మనుగూడ జయించి హృత్పీఠము నధిష్ఠించి మఱపు రాకుండంగం జేసి పరమోత్కృష్టమైన యీశ్వరధ్యానము నా కలవరచి సర్వము మిథ్యయని నిరూపించి మమ్ము ధన్యులను జేసి

పోయినది. కాలచక్ర మేగుచున్నది. సంసారచక్రముకూడ మాటిమాటికి నిస్సారమై నడచుచున్నది.

మహాలక్ష్మి సుందరీదేవికి నామె పుట్టినింటి వారికి నా జన్మాంతము కృతజ్ఞుఁడనై వ్యామోహముఁ ద్యజించి యీశ్వరుని ధ్యానించుచుంటిని. మహిళాలోకము సుందరీ దేవిగుణము గుర్తెఱింగి తమ విధులను సక్రమముగ నిర్వర్తించి పెద్దలయందు భక్తి, భగవత్సేవ, సద్వర్తన కలిగి యిట్టులనే ఆదర్శప్రాయులుగనుండి సద్యశస్సు గడించి చిరస్థాయి నొందెద రని యాసించుచున్నాను.

నా భార్యయని మోహముచే వ్రాసినవాఁడను గాను. ఆమె భక్తురాలు. 'కాంతాసమ్మితతయా ఉపదేశయుజే' అని చెప్పినట్లుగా నీ సుందరీదేవి నాకు మహాకావ్యమువలె సకల రసానుభవములు గలిగించి సదుపదేశములు మనసున కతుకున ట్లొనరించి నన్ను గురుదేవవిశ్వాసము గలవానినిగా నొనరించి నాకుఁ బరమార్థమును సూచించిపోవుటచే నామెయందుఁ గల మహాగౌరవముచే నీ వ్యాసమున నా విశ్వాసము చూపితిని. సాధువులు క్షమింతురుగాక.

ఓ మి తి శి వ మ్.

# శ్రీ మహాలక్ష్మీసుందరాంబా స్మృతి

కవితిలక, కవితావిశారద

కాంచనపల్లి కనకాంబా ప్రణీతము

ఇట్టె వచ్చెను దిన మొక యేఁడు గడచె
మా మహాలక్ష్మికి సుందరాంబకు నఖండ
శాశ్వత బ్రహ్మలోకవాసంబు గలిగె
నెద భరించును గద యెంతయెంతయైన. ౧

అప్పటికిఁ గొత్త మఱునాటి కగును ప్రాత
ప్రియుల యెడబా టదెంతటి ప్రీతియున్న
మా మహాలక్ష్మి యెడబాటు మా మనములు
నమలుచున్నది నాటికి నాఁడు మలచి. ౨

సుకవిగేయంబు సర్వాంగ సుందరంబు
శాస్త్రవిహితంబు గురుదైవ సమ్మతంబు
భక్తిభరితంబు లలితంబు పావనంబు
శేషమాంబా తనూజాత జీవనంబు. ౩

మా మహాలక్ష్మి యాపాదమస్తకంబు
పెద్దరికమును దాల్చిన ముద్దరాలు
పసుపు కుంకుమ కాటుక పాపటయును
దంతకాంతుల డాగు మందస్మితములు. ౪

ఎంతవినయంబు చదువది యెంతయెంత
సంతసము శాంతమో తల్లి యెంతయెంత
పట్టు విడుదలయెంత సంబర మదెంత
యెంతలెంతల కాయువ దెంత నీకు.

వల్లభునిఁ దల్లిదండ్రులఁ బంధువితతి
సత్పథమున నిల్వంబెట్టఁజాలు ధీర
ఆచరణచేసి చూపు పుణ్యాత్మురాలు
కోటికొక్కర్తు సుందరి సాటిలేదు.

పుట్ట రనుకొన్న తల్లికి ముదిమినెట్టొ
పుట్టిపెఱిగితి వల్లారుముద్దుగాఁగ
కన్నవారికి బేబివై కరతలముల
భువనమోహనమై పొల్చు ముత్యమట్లు.

రవ్వాయగురాలఁ దామరపువ్వు పూల
బాల బాలాంతరులయింట బాలయయ్యె
అందమునఁజందమున మన సుందరాంబ
చందమామను మించిన దందు రెందు.

బొమ్మలనుజూపి చెప్పితి పూర్వకథల
నల్లిబిల్లిగఁ గట్టితి బుల్లిపాట
పద్యములఁజెప్పి యర్థ ముపన్యసించి
చెలుల నలరింతు పాటలఁ జేరఁబిలిచి.

పుట్టకయె నేర్చినావేమొ చిట్టితల్లి
తేట తెనుఁగులు గాక హిందీయు సంస్కృ
తంబు బాల్యంబునందె యాంగ్లంబు గూడ
బాలవయ్యును జదువులఁ బ్రౌఢవైతి. ౧౦

ఈడు జోడుగాఁ బెఱిగి నా యింటనేమొ
బావనే గాని యొరునిఁ జేపట్టననుచుఁ
జెట్టపట్టితి కాళ్లకూర్ శేషమంత్రి
మదినిఁ గైకొన్న వానిని మానునె సతి. ౧౧

దిక్పతులను మాని దేవేంద్రునిఁ మాని
మనుజపతినిఁ గోరె మును నొకర్తె
సిరి నెదనుధరించు శేషశాయిని మాని
శేషమాంబ పుత్రి శేషుఁగోరె. ౧౨

సంపదలఁ జక్కదనమునఁ జదువులందు
నెక్కుడై, తాను, నన్నెంతొ మక్కువఁగను
పల్లెరంబున దినము నాకాళ్లుఁ గడిగి
దాపు సుందరి నా కెట్లుదక్కు ననుచు. ౧౩

నీ విభుఁడు నాఁడు దుఃఖింప గ్రావములును
గఱుగు, నాప్తులు కన్నీరుఁ గార్చుటరుదె
భావములు మాఱె నీ నేఁటి భామలందు
దేవతలు గారె తలఁపఁ బతివ్రత లిల.

కాకినాడ పురంబున గడపఁతొ్రక్కి
కాశికాపురమున మధ్యకక్ష్య గడచి
సత్కళా మందిరంబున స్వామిని యయి
చెన్నపురమున సుందరి చెన్నుమీఱె.

ఆంధ్ర గీర్వాణములను విశ్వాతిశాయి
యైన విద్వత్తు గలిగి నీ వలరినావు
చదువు రానట్టి కేవల సాధ్వివోలె
వినయమును దాల్చి మెలఁగితి వనితలందు.

నేటి విద్యాలయంబులఁ జేటు లెఱిగి
కలికలుష మెల్లఁగడిగి ప్రజ్ఞాబలమున
బురదలో నుండి కుమ్మరి పుర్వువోలె
పాఠశాలలలో నుండి బైటఁబడితి.

మీరబాయిని మించితి మీఱకుండఁ
జులకచేసితి సులభ నీసూక్ష్మబుద్ధి
గార్గి మించితి నీదు జిజ్ఞాసకలనఁ
గబళమైతివి బిడ్డ యాకలికి కలికి.

మోహమునను దండ్రి సుందరరామువోల్కి
నెమ్మదిని వెన్ను తల్లి శేషమ్మమాద్రి
వినయసుందరి సుంధరి కెనయె యొకతె
ఉన్నఁబోయిన నామెకు నుపమ యామె.

నీదు గుణగానమేఁ జేయ నిన్నుఁ జూడ
వలచు సాధ్వుల కేనేమి పలుకుదాన
సుందరీ! నీదుమో మిందుఁ జూపరాదె
నమ్మకముగల్గ నాదు పద్యమ్ములందు. ౨౦

సచ్చిదానందపద సుధాసారకలన
జీవతను బాసి తద్భావ భావనమున
నాత్మ తాదాత్మ్యమంది బ్రహ్మానుభూతి
మెఱసి మఱఁగైతి మబ్బుల మెఱపువోలె. ౨౧

జీవయాత్ర నరసి భావంబు బ్రహ్మంబు
నందు మోపి సర్వమదియ యంచు
సుందరాంబ ధర్మసూక్ష్మంబు నరయుచు
ధవునితోడ నింట ధన్యయయ్యె. ౨౨

అక్కరాల నేర్పుఁ డమ్ముల కదియు మీ
యంతదైనఁ జాలునంచు శేష
మాంబ నిన్ను నాకు నప్పగించిన నీకు
నింతె యాయువంచు నెఱుఁగనైతి. ౨౩

అక్షరాలు నేర్చి యక్షరతత్త్వంబు
నరసి కళలు విద్య లన్ని నేర్చి
నన్ను నిన్నుఁజూచి నల్వురుమెచ్చు లో
పలనె మాయమైతి భావ్యమె యిది. ౨౪

అన్నియిచ్చి యొక్క యాయువు నడుఁచు నీ
కీఁడుగాక నీకు నీ డెవరిల
మూటకట్టుకొన్న ముదుసళ్ళ నటుల్త్రోసి
ముండ దేల పోతి సుందరమ్మ!

అల్ల కాణాద పాణినీయములు కాపి
లంబు పాతంజలంబు నాలంబమైన
సరససాహిత్య సంపదఁ బరిఢవిల్లు
నిన్ను మఱువంగవచ్చునే కన్నతల్లి!

నాల్గుభాషలలో నీవు నాల్గుదిక్కు
లందు ధర్మంబు బోధింతు వనుచు నెంత
సంతసించితినో భగవంతుఁ డెఱుఁగు
సుందరీ! మోసమిది యని సుంత యెఱుఁగ.

చదువుగల్గెనేని సంప్రదాయము సున్న
సంప్రదాయ మున్నఁ జదువుసున్న
రెండు నుండెనేని దండితనము సున్న
నాయువగును సున్న యన్నియున్న.

గురుల నోటినుండి దొరలిన సూక్తుల
మౌక్తికంబు లట్ల మాలకట్టి
యఱుత దాల్చి మించి యమృతాంశురశ్మిలో
నందరాంబ యైక్య మంది పోయె.

దేవా! నిన్ను వర్ణించుటకు వేదములే చాలక మూగ వాని వలె మౌనము దాల్చుచున్నవి. అపౌరుషేయము లగు వేదములే యట్లయిన సామాన్యులమైన మానవులము, మా వాక్కుల కెట్లు నీవు గోచరుడవగుదువు. అట్టులయ్యు వేదాంత శాస్త్రసారమును గ్రహించి, చింతించి, కీర్తించి, బహువిధాభ్యా సంబు లొనరించి నిన్నుఁ బొగడుటకుఁ బ్రియత్నించు చుందుము. ఉపాసన లెన్ని చేసిన జ్ఞానభక్తియోగంబులు సాధించిన నింక నెన్నెని యుపాయము లాశ్రయించి కష్టించినను వైరాగ్యంబు లేనివానికి మోక్షాధికారము కలుగ నేరదు. (కలుగనే కలుగదు)

ముక్తిసాధనంబులు మూఁడు. వైరాగ్యము, ఆత్మ బోధము, భక్తి. ఈ మూఁటిలో మొదటిది విరాగము. విరాగ మనఁగా వితృష్ణత. అనఁగా నాసలేమియే. అ య్యాశాస్వరూప మెఱుఁగుటయే దుర్ఘటము. దానిం జయించు మాటలేల? సర్వ దేహంబులయందు నహంతగా మమతగా నా తృష్ణ డాగి యున్నది. జంతువు లి య్యహంత తమ దేహములయందును, మమత, భార్య మొదలగు విషయములయందును దాల్చి యున్నవి.

ఇంతగా సకల దేహములయందును డాగియున్న యీ యహంతా మమతలను బారదోలుట యెట్లన్నచో వినుండు. "ఈ తను వేమిటం బొడమె? దీని స్వరూపమేమి? విషయము లతో నీ శరీరమున కేమి సంబంధము!" అని సాధుసన్నిధిలో

శాస్త్రాభ్యాసముచే విచారణచేసిన యెడల నీ యహంతా మమతలు నివర్తించును.

అహంత యనఁగా నేననుకొనుట. నే నింతవాఁడను, నాకు మించినవాఁ డెవఁడు, సర్వసమర్థుఁడ నను నహంభావము. మమత యనఁగా నాది యనుకొనుట. నా భార్య, నా బిడ్డలు, నా బంధులు, నా యిల్లు, యిట్లు తనవని యనుకొన్నవాని యం దొకయభిమానము కలిగించుకొనుట.

ఈ దేహంబెట్లు కలిగెననఁగా స్త్రీపురుషుల సంయోగముచే శుక్రశోణితముల మిశ్రమము కాఁగా నా రెంటి వలన నేర్పడిన బిందువులోఁ గర్మవశుఁడగు జీవుఁడు చల్లగాఁ బ్రవేశించి దేహధారి యగుచున్నాఁడు. ఇట్లు శరీరము దాల్చిన జంతువు కఫముతో మూత్రముతోఁ బురీషముతో నిండియున్న తల్లిగర్భమను గుంటలోఁబడి తొమ్మిది మాసములు సంతతము జఠరాగ్నిచేఁ గ్రాగుచుండును. దైవయోగముచేఁ బ్రసూతిసమయమునకుఁ బిండం బడ్డముగాఁ దిరిగి సుఖప్రసవము కాని యెడల శస్త్రములచే ఖండింపఁబడి బలాత్కారముగా బయటికి లాగఁబడును. అట్లుగాక సవ్యముగాఁ బ్రబలమగు ప్రసూతివాతములచే మాతృద్వారమునుండి పిండము బైటికి వచ్చినను దత్కాలమందలి వేదన చెప్పఁదరమా?

ఇంతకష్టపడి తల్లికడుపు వెడలివచ్చిన జీవునకుఁ బుట్టిన వెనుక నేమైన సుఖముకలదా? ఎన్ని ఘోరములు, ఎన్ని రోగములు, ఎన్ని గండములు. తనవారి నెడబాసియుఁ దిక్కుగని

దారిద్ర్య మనుభవించియుఁ దప్పఁకొనఁ జాలని యాపదల బొందియు ననుభవించు మనోవ్యథ యింతని వర్ణింప శక్యమా

పుట్టుచు గిట్టు నీ జీవుఁడు నరుఁడై, పశువై, పక్షియై, పురుగై యెనుబదినాలుగు లక్షలయోనులందు కర్మనిబద్ధుండై పరిభ్రమించుచు యాతన ననుభవించుచున్నాఁడు. జననమరణ ప్రవాహమునుండి యెట్టకేల కీ జీవుఁడు పుట్టి స్వకులాచార పరుఁడై, వేదాచారపరుండై యుండియుఁ బండితుండై యుండియు నాత్మానాత్మవివేకం బెఱుఁగక దేహము నశించున దే యని తెలియఁజాలక కామాదులలోఁబడి యాయువును వ్యర్థ మొనరించుచున్నాఁడు. ఇంక నీ యాయుస్సెట్టిదనఁగా గడచిపోయిన క్షణముతో నొక్కలవమాత్ర మేని లక్షలధనము పోసిన నెక్కడనుండియేని కొని తేరానిది. ఆయువే పోయిన నంతయుఁ బోయిన దే యగును. అంతకంటె హానియున్న దా

ఇట్లాయుఃక్షయం బొనరించుకొన్న జీవుఁడు భ్రాంతులం జిక్కి "భ్రాంతియా వైకుంఠపాళియందుఁ బెద్ద పామువోలె" యని జీవయాత్రలో వ్రాసినట్లు పతితుఁడై పశ్వాది దేహములం దాల్చి తన శరీరమే తా నెఱుంగని స్థితిలో నుండు తరుణమునఁ బరమార్థ మను మాట యెక్కడిది?

రామరామ! ఆకలితో బక్కజిక్కి యెడతెగక బరువులు మోయుచుండు నీ యెద్దులు, దున్నలు, గుఱ్ఱములు, గాడిదలు పడుకష్టము వర్ణింప వశముకాదు. రసము, రక్తము, మాంసము, క్రొవ్వు, మజ్జ, యెముకలు, శుక్రము లను సప్త ధాతువులును, వాతపిత్తశ్లేష్మంబు లనియెడి త్రిదోషంబులును

జేరి యైన దీ దేహము. పైనఁ జర్మముచేఁ గప్పఁబడిన కారణ మునఁ గాకులచే భక్షింపఁబడకయుండు.

తన ముక్కున నోట వెడలు కఫంబుఁ జూచియు నపాన మార్గంబున వెలువడు మలమూత్రములఁ జూచియుఁ దానే యసహ్యపడు జీవుఁడు తనలోనుండు పదార్థం బెఱుంగఁడుగదా! దారిలోఁబడియున్న యెముకనుజూచి తన కెక్కడ యంటునో యని యులికిపడి భయపడి తొలఁగిపోవు జీవుఁడు తన తను వంతయు నీ బొమికలతోఁ జేయఁబడిన బొమ్మయే యని చూడ లేఁడు. శిరస్సు మొదలు చిటికెనవ్రేలువఱకు లోన దుర్గంధపరి పూర్ణమగు నీమేనిపై సజ్జింపు చందనాగరుకర్పూరంబులంబూసి కొని స్వాభావికంబులగు దోషంబులం గప్పిపుచ్చుచుఁబై మెఱుం గుల గుణంబులకుఁ జెలంగుచున్నాఁడు. ఈకాయమునందుఁ దగిలిన గాయమును మూఁడు దినములు మాత్రము కడుగక కట్టక విడిచిరేని యది పుచ్చి పురుగులు పడి గబ్బుకొట్టును. హంసతూలికాతల్పములపైఁ బూల పాన్పులపైఁ బవళించి నిదురించిన సుకుమారశరీరమే వెదుళ్లతోఁ ద్రాళ్లతోఁ గట్టి తీసికొని పోఁబడి కట్టెలతోఁ గాల్చివేయఁ బడును.

సింహాసనోపవిష్టుఁడై యుండునపు డెవనిఁ జూచి లోకము ముదమొందెనో యా మహారాజాధిరాజు కాల ప్రేరి తుఁడై కొంపోవఁబడునపుడు చేయఁదగినది లేక కన్ను లప్ప గించి చూచుచుండ వలసినదే కదా.

ఇట్టి యతిమలినమైన క్షణభంగురమైన దేహ మెవని సత్తువచేతఁ జేతనము దాల్చి చలించుచున్నదో యా పరమే

శుని మఱచి జీవుఁడీ యనిత్యమగు దేహమునందు నేనను నహంతను కలిగించుకొనుచున్నాఁడు. "సచ్చిదాత్మకమైన యాత్మ యెక్కడ? మాంసరుధిరాస్థినిర్మితమైన దేహమెక్కడ" అని విచారించి యే బుద్ధిమంతుఁడు తన శరీరముపై నభిమాన ముంచుటకే సిగ్గుపడునో యాతఁడెట్టు లితరవస్తువులపై మమ కార ముంచును.

ఇంతతో దేహనిందాప్రకరణ మైనది. ఇఁక విషయ నిందాప్రకరణము వివరింపఁ బడును.

## విషయనిందా ప్రకరణము

శరీరమున దోషమును సువ్యక్తముగా నిరూపించి శంకర భగవత్పాదాచార్యులవారు విషయానుభవమునం గల దోషముల నిట్లు ప్రతిపాదించుచున్నారు.

పట్టి వ్యామోహంబునఁ బురుషుఁడు బురద పూసికొను చున్నాఁడు. దురదృష్టమను వృష్టిచేఁ దాను పూసికొన్న మట్టి కరఁగి దేహమును గేహమునుగూడఁ గూలుచున్నవి.

తత్త్వశాంతిలేని జీవున కొక విధమునఁ గాదు చింత. ఒకఁడు తనభార్య కురూపి యని మనసులో దుఃఖించును. మఱి యొకఁడు తనభార్య యందకత్తె యని దుఃఖించును. మిత్రుఁడో భృత్యుఁడో, చివరకు వాకిట నిలచిన బైరాగివాఁడో తనభార్య నెక్కడ వశ మొనరించుకొనునో యని యాతఁడు కుందు చుండును. ఈ రీతిగా నందమైన భార్య చర్యలకు సదా

కోపము ననుభవించుచు భర్త లేశమైన సుఖము నొంద కున్నాఁడు. తెలివితక్కువ పెండ్లాము తనమాట మనసు నెఱుఁగ లేక యెడ్డెపనులు చేయుచు శత్రువువలె బుద్ధికి క్షోభ గలిగించును. ఇట్టి మొద్దు పరాభిలాషిణికూడ నయ్యోనేని యాగేస్తుని పాట్లు దేవుని కెఱుక. సుతులు లేనివారలకు గతులు లేవందురు. పడరాని పాట్లు బడి పుట్టకు ధనులుపోసి ప్రాణాచారములు పడి సుతునిం బడసిన వారి కా సుతుఁ డేమి చేయునో? పుట్టినవాఁడు బ్రదుకునా యని చింత. తన కొడుకు జారుఁ డగునో, చోరుఁ డగునో, లోభి యగునో, భ్రష్టుఁ డగునో, జూదమాడునో, క్రూరుఁడగునో, తల్లి దండ్రుల కన్నము పెట్టునో పెట్టఁడో యని యొక్కొక్క తండ్రి తన కొడుకును గూర్చి యడలుచుండును. పెత్తనము, పెట్టె తాళముచెవి తనచేతి కెప్పుడు వచ్చునా? ఎప్పు డీ ముసలివాఁడు కన్ను మూయునా? యని యొక కొడుకు చింతించును.

సర్వగుణ సంపన్నుఁడైన కొడు కెక్కడనో కాని దొరకఁడు. ఒక్కఁడట్టివాడు పుట్టినను, వాఁడు రోగి యగునో యల్పాయుష్కుఁడగునో యను చింత యుండనే యున్నది. పుత్త్రునివలన సద్గతి కలుగునని మూఢు లనుకొందురు. నూర్గురు వివేకులఁ గన్న ధృతరాష్ట్రునకు వారివలనఁ నేమి సద్గతి కలిగినది. అపుత్రకుఁడైన శుకమహర్షి కేమి సద్గతులు తప్పినవి. తలిదండ్రులు, కొడుకులు, కోడండ్రు, కూతులు, నల్లుండ్రను వారు సత్రములోని బాటసారులవలెఁ గలసి కాలానుసారముగా విడుచుచుందురు. దైవముతిన్నగాఁ జూచి పదిమందికి

నింటిలోఁ బంక్తులు సాగుచున్నంత కాలము కట్టుకొని చుట్టుకొని పోవుచుండు చుట్టము లందఱుఁ బొట్టలు నిండిన కతమున బట్టులవలెఁ బొగడుచుందురు. ఏమిచేసినను బూడని పొట్టకై లక్షలకొలఁది విత్తము సంపాదింపఁ జిత్తము ప్రవర్తించు చుండునే కాని కామము తీరదు. ఒక్క గుడ్డిగవ్వయైనఁ జిక్కదు. చిక్కినను ధనమున కెందఱవలననో యాపద. రాజులో దొంగలో శత్రులో దానిని గ్రహింతురు. పాపము లెన్నియో చేసి యుపార్జించిన రాజులసొమ్ము ఱాళ్ళపాలు, ఏనుఁగులపాలు, గుఱ్ఱములపాలు. ఇంతటి రాజయోగ మను భవించువారికి శాంతి యావంతయేని కానరాదు. అమాత్య భృత్యవర్గము కలసి ద్రోహ మొనరింతురనియో, పరరాజులెత్తి వత్తురనియో, రణరంగమున భంగము కలుగుననియో విసము పెట్టుదురనియో, యేమూలనుండి యేమి చేయుదురనియో రాజులు సంతతముఁ జింతనొందుచుందురు. సంపత్తువలన శాంతిలేదు. సామ్రాజ్యము వలనను శాంతి కానరాదు.

## మనోవిందా పకరణము

ఈ మానస మొక్కప్పుడు నవ్వుచుండును. మఱొకప్పు డేడ్చుచుండు. భ్రాంతిచే దశదిశలు ధావనము సేయుచుండు. సంతసించుచుఁ గోపించుచు, శిష్టవృత్తినుండుచు, దుష్టమగుచు, నిందించుచుఁ గీర్తించుచుఁ బలుగతుల నడచుచుండును. పరాప వాదము సేయుచుండును. తన్నుఁదాఁ బొగడుచుండును. ఆశతోఁ గూడెనా యీ మనసు పిశాచమగును. దంభాభిమానలోభము

లచేఁ గామక్రోధ మాత్సర్యములచే మార్గమునఁబడిన యస్థు లకై కుక్కవలె నిట్టటుఁ దిరుగుచుండును. కాఁబట్టి శుద్ధమైన విరాగముచే మనసుకోరిన పదార్థములపై నాసవిడువవలయును. కోరికలేని మానసము నిర్వ్యాపార మగును.

## విషయ నిగ్రహ ప్రకరణము

అపారమగు విషయవిషములతో నిండిన యీసంసార సముద్రమునందు మానవ శరీరము పడవవంటిది. ఇది కర్మ యను ననుకూల ప్రతికూల వాతములచే నిట్టటుఁ గొట్టఁ బడుచు ఁ దేలియాడుచుండును. ఈ పడవకుఁ దొమ్మిది రంధ్రములుగలవు. నౌకాపతి యగు జీవుఁడు మిక్కిలిసోమరిపోతు. ఈ రంధ్రములు మూయక విడిచినయెడల వానినుండి నీరోడలోఁ జేరి, దాని నడుగునకు ముంచివేయును. ఈ చిల్లులు మూసెనా యనాయాసముగా నీపడవ యావలియొడ్డు చేరఁ గలదు. అనృత జడ దుఃఖాత్మకమగు నీ సంసారసాగరమును దాటుట కింద్రియ నిగ్రహముకంటె సుఖమైన మార్గములేదు. తన కందదని తెలిసి పరుని భార్యపై నాసచేసి ప్రయత్నించును? ఈ వ్యర్థప్రయ త్నము వలనఁ బాపాత్ముడగుటకంటె మనుజున కేమిమేలున్నది. కొండెగాండ్రవలన నొరులపైఁ జాడీలు సంతతమొకఁడు చెవులు దొరబెట్టుకొని వినుచుండును. ఇట్లు వినుటవలన నరుడు చచ్చునా? నొచ్చునా? వ్యర్థముగా మనుజుఁడు పాప మనుభవించు చున్నాఁడు. అబద్ధములు నపవాదములు క్షణక్షణము నాలుక పలుకుచుండును. దాని వలన నెవరి కేమి హాని కలుగును? తాను మాత్రము పాపాత్ముఁ డగుచున్నాఁడు.

అరనిముసము తా ననుభవించిన సుఖమువలన బ్రతికి నంతకాల మాధివ్యాధు లనుభవించుచున్నాఁడు. ఆ విష యానుభవమైన తోడనే దాని బాధయే మిగులుచున్నది. కావున నేది గ్రహింపఁదగినది, యేది విడువఁదగినది యని బుద్ధిమంతుఁడు లెస్సగా విచారించి, నిశ్చయించి అల్పసుఖము లకై యాసపడి యనంతదుఃఖమునుండి తప్పించుకొనుచున్నాఁడు.

బెస్తవాఁడు వైచిన గాలమందలి యెఱకై యాసించి చేప ప్రాణములను బోఁగొట్టుకొనుచున్నది. ఆ ప్రకారముగా నా యా సుఖము లనుభవించుచు నరుఁడు కాలాకృష్టుఁడై పతితుఁ డగుచున్నాఁడు. పామునోట సగముచిక్కిన కప్ప చెంతనున్న యీఁగల భక్షించుచుండును. అట్టులనే యాయువు చెల్లి పోవుట యెఱుంగక గ్రుడ్డివాఁడై జీవుఁడు విషయములను సంపాదించుకొనుచున్నాఁడు.

## మనోనిగ్రహప్రకరణము

తనలోనుండి పుట్టిన నీటితోనే నది నీచమార్గము పట్టుటచేత శతధా చీలి సముద్రములోఁబడి నామరూపములు లేకుండఁ బోవుచున్నది. తాను నీచమార్గమునఁ బోక తనలోఁ బుట్టిన నీటిని దాను బిగబట్టి నిల్పుకొన్న యెడల నీ నదియే యొక సముద్రము కాదా! అట్లే మనస్సు కూడఁ దనకుఁ దనకృత్యమునకు హేతువైన వస్తువును విచారణసేయుచు బైటికిఁ దలచూపక లోపలనే యుండిన యెడలఁ దానేల యాత్మత్వమును బొందదు? తప్పక తానే యాత్మయగు ననుట.

వర్ష కాలము నందు నూతికి నిండుగ నీళ్ళుండి పెద్దపెద్ద జలలు (జలధారలు) ప్రక్కల నుండి నూయి నింపుచున్న తేటి నీరుప్పగా నుండుట ప్రసిద్ధము. మండు వేసవిలో బావులెండి పోయి యడుగున గొంచెము మిగిలిన నీరు తియ్యఁబడుటయుఁ జూచుచున్నాము. అట్లే విషయోద్రేకములతోఁ దమస్సు ప్రధానముగా నున్న మనస్సు మిక్కిలి కలఁతబారి కలుష ముగా నుండును. ఆ మనస్సే విరాగముచే శుష్క మైనపుడు మెల్లమెల్లగా సాత్త్వికమగుచుండును. ఏ విషయమును గోరి బహిరింద్రియముల ద్వారా మనస్సు పఱుగెత్తు చున్నదో యా విషయము తనకు దుర్లభ మయ్యెనేని తనదేమో పోయి నట్లుగా మిక్కిలి శోకించును.

సొరకాయ నెంత నీటిలో నదిమి పట్టినను పైకెగిరి వచ్చి నట్లు మనస్సు స్వస్వరూప మందెంత యదిమి పట్టిన నేదో నందు చూచుకొని పైకిలేచి బహిరింద్రియముల ద్వారా బయటకు దూకుచుండును. పూర్వజన్మమందు గాని యీ జన్మ మందుగాని జీవుఁడు చేసికొనిన కర్మఫలము కోరకయే మనకు శుభాశుభములను గలిగించి తీరును. సందియము వలదు.

దారితప్పి పరగళ్ళమేతలకుఁ బఱువులువారు నీ చిత్త పశువును బట్టుకొనుటకుఁ దగిన దొక్క వైరాగ్య మను గుది బండ బ్రహ్మదేవుఁడు కల్పించెను. ద్వారములేని యెత్తుగోడల గదిలో బంధింపఁబడిన పెద్దపులి యటునిటుఁ దిరిగి యెగిరి యెగిరి యలసి రొఁజుచు నెటులఁబడియుండునో యటులనే సర్వేంద్రియములు బంధింపఁగాఁ దానెంత పెనగులాడిన

బయటకుఁ బో పీలుపడక మనస్సు తన లోపలనే శాంతించి యుద్యమరహితం బగును.

ప్రాణాయామము చేతను దేహాదివాసనాపరిత్యాగము చేతను హరిచరణారవిందభజనము చేతను జిత్తము క్రమ క్రమముగఁ దన వేగమును వదలిపెట్టి శమించును.

## వైరాగ్య ప్రకరణము

పరునింట నిల్లాలు దనయులును సొమ్ములు నేమైనను వానియింటి లాభమైనను నష్టమైనను బైవాని కేమి? పైవాఁ డొక్క నిముసమేని వాని సంపదకు సంతసింపఁడు. వాని కష్టమునకు వగవఁడు. దైవయోగమున నేమైన నింటనుండనీ పోనీ, యేదియో పుష్కలముగఁ గలసి రానీ, రాకపోనీ, యనుభవ మెందేని యధికముగా నుండనీ పూజ్యముగా నుండనీ, యతిథివలె గృహయజమాని సంతసింపక దుఃఖింపక యుదాసీనుండై యుండఁదగు.

మమతాభిమానశూన్యుండును, విషయవిముఖుండు నగు పురుషుండు నిజగృహమునఁ గాపురము సేయుచుండియుఁ గర్మబాధలం బొందఁడు. అట్లుకాని నా డరణ్యప్రదేశంబున సమమైన పచ్చని పచ్చిక నేలపై సుఖంబుగా శయనించు పురుషునకుఁ బత్రపుష్పఫలభరితంబు లగు తరువులు సుగంధి శీతలంబు లగు వాయువులు నెల్లెడఁ గలకల కూయు శుకపికంబులు కన్నుల కింపు నింపెడు కాసారంబులు మిత్రంబు లేల కావు.

తన యునికిపట్టు మఱచి యీ ఘోరసంసారకాంతారమునఁ దిరిగి తిరిగి తాపత్రియము లను దీర్ఘ దావానలజ్వాలలచే మిక్కిలి వ్యాకులముఁ జెంది యెగురుచు దుముకుచుఁ గన్నులు జేవురింపఁ బఱువెత్తి యాశాపాశములలోఁ దగుల్కొని విషయము లను పెద్దపులులచే నన్యాయముగాఁ జంపఁబడుచున్నాఁడు.

వైరాగ్యభాగ్యము కలవాఁడు, ప్రసన్నమైన మనస్సు కలవాఁడు, ఆశలేనివాఁడు, కోరకయే తనంత వచ్చు ఫలము ననుభవించువాఁడు నగు పురుషుం డీ జన్మమున నీ లోకమునందే కృతార్థుఁడగును.

## ఆత్మసిద్ధి ప్రకరణము

గురుబోధలేని వైరాగ్యము సుఖావహముకాదు. సద్గురువుల యనుగ్రహముచేతఁగాని సుఖబోధ లభింపదు. కావునఁ దొలఁదొల్త సిద్ధికాముఁడైనవాఁడు గురుపాదముల నాశ్రయింపవలెను. మహోదధియందెంత యుదక ముండినను దప్పిగ్రుండగు వాయు వద్దానఁ దుంగభంగముల విలాసము కల్పించినను బిపాసాకులితమైన చాతకము మేఘోదయమునే నిరీక్షించుచుండుఁగదా. శాస్త్రప్రవచనము గురుబోధము నాత్మవిశ్వాసము నని ప్రమాణము ముత్తెఱంగులు. బెల్లము తియ్యగా నుండునని చెప్పుటవంటిది శాస్త్రప్రవచనము.ఎదుట దూరముగా నున్నదానిని జూపి యిదియే గుడ మని చెప్పుట వంటిది గురుప్రతీతి. తద్గుడభక్షణము వల్లఁ గలిగిన సుఖమే ఆత్మప్రతీతి.

రసాలఫలమునందలి రుచిగాని, కుసుమముల సుగంధముగాని జంత్రిగాత్రిముల గీతముగాని, దివ్యసుందర దేవతాస్వరూప ములుగాని, మలయానిల చందనాదుల స్పర్శసుఖముగాని మత్తి యే యితర పదార్థాదుల వలనఁ గలుగు నానందమేని దేని చేత ననుభవింపఁబడు చున్నదో బుద్ధిమంతుఁ డారయవల యును. ఈ యనుభూతి దేహమునకుఁగాని చక్షురాదీంద్రియ సమూహమునకుఁగాని లేదు. శవమునకు దేహేంద్రియ వర్గ మునకు దాహజమైన దుఃఖము తెలియుటలేదుగదా! ప్రాణ మునకే తెలివియున్నయెడల నిద్రించువానికి దొంగలవలనఁ గలుగు నుపద్రవ మేల తెలియదు? మనసునకే తెలివియున్న యెడల నొకమాత్రే సకల విషయముల నేల గ్రహింపరాదు. ఆ మనస్సు పరాధీనమై యుండుటచేతఁ గదా ప్రమాదము కలు గుట? ఈ ప్రమాదము నుండి తప్పించువాఁ డెవ్వఁడు?

చీఁకటింటిలో నేలపైన దీపముపెట్టి, దానిమీాద నయిదు చిల్లులు గల కలశమును బోర్లించి, ఆ కలశమునకు వెలిగా నన్ని వైపుల రంధ్రిములకు సూటిగా వీణను, గస్తురిని, రత్న మును, వ్యజనమును స్థాపింపవలెను. లోపల వెలుఁగుయొక్క యంశముచేత విడివిడిగాఁ గనఁబడు వస్తునముదాయ జ్ఞానము రంధ్రిములవల్ల గలుగుచున్నదా? కలశమువలననా? మృత్తువలననా? కుండవలననా? తైలముచేతనా? లేక వత్తి చేతనా? పైఁ జెప్పఁబడిన వేనివలనను గాదనుట ప్రత్యక్షమే. ఈ జ్ఞానమున కంతకు దీపకాంతినే మనము శరణుఁ బొంద వలయు ననుట స్పష్టము. అట్టులే దేహమం దాత్మగూడ నిలిచి

యున్నది. విజ్ఞానఘనుం డగు పరమాత్ముండు తన్నుఁదా నవ
లోకించుటవలననే సోఽహంనామకుఁ డయ్యెను. అందువలన
భేదమునకు మూలమేర్పడియె. పతియుఁ బత్నియు రెండుగాఁ
గనఁబడుదురుగదా! అందుండి క్రమముగాఁ ద్రివిధమగు
నాకాశ మేర్పడియెను. (ఉద్భవించెను) ఆ యాకాశ మాత్మావ
లోకనంబునఁ గ్రమంబుగ మనుష్యులఁ బ్రసవించెనని యుపని
షత్తులలో యాజ్ఞవల్క్యుండు దన ప్రియపత్ని కుపదేశించెను.

చిరకాలము సుఖసుషుప్తివలెఁ బరమాత్మ యనుభ
వించిన పరమానందమునుండి యనిర్వాచ్యమగు నొక స్థితి కలి
గెను. ఆ యవస్థనుండి స్వప్నమువలె మాయ యుద్భవించెను.
ఈ మాయ సదసద్విలక్షణమైనది. అనఁగా నిదియున్నదికాదు,
లేనిదికాదు. దీనికి మొదలులేదు. పరమాత్మయొక్క యునికి నాశ్ర
యించి యున్నది. గుణత్రయాత్మక మగు నీమాయ సచరా
చరమైన యీ విశ్వము నంతను బ్రసవించు చున్నది. అది
యటు లదృశ్యమగుచోఁ గార్యరూపమగు ప్రపంచము నెట్లు
పుట్టించు చున్నది? కన్పడని నూలుచేత నేయఁబడిన వస్త్రము
కనఁబడుచున్నదా?

అనఁగా, స్వప్నమందుఁ గలిగిన సురతానుభవముచే
శుక్రస్రావము వస్త్రమందుఁ గానవచ్చుఁ గదా? రత మసత్య
మైనను మేలుకొను నప్పటి వస్త్రోపహతి సత్యముకదా! స్వప్న
మందు పురుషుఁడు నిజము. అంగన యసత్యము, వారిరువుర
కలయిక కల్ల. అట్టులయ్యు శుక్రస్రావము సత్యమైనట్లుగాఁ
బ్రకృతమైన మాయకార్యమందును దటస్థించు చున్నదని

యెఱుంగనగు. మాయ కానరానిదయ్యుఁ దత్కార్యమగు నీజగత్తును దృశ్యమగు దానిని గాంచుచున్నది. ఇట్టిగుణముల తో నున్న మాయ తనవినాశము చేత నానంద మొసఁగు చున్నది. తెల్లవారని రాత్రివలె నీ మాయ స్వభావముచేత దురంతమైయుండును. మహామునులు తేటివారఁజూడఁగా మెఱుపు తీఁగవలె క్షణములో నాశనమగును.

మాయ యనఁగా బ్రహ్మను బొందిన యవిద్య, జీవుల కాశ్రయముగా నిలిచి యుండును. మోక్షము కలుగు వఱకు నిమ్మాయ తెలివి మఱపులతోఁ గూడిన యక్షయమగు కీలుముడివలె నుండునని యెఱుంగునది.

ఘటములో నున్నది ఘటాకాశ మనియు, మఠములో నున్నది మఠాకాశ మనియు, గోడల నడుమనున్నది కుడ్యా కాశమనియు నాయాచోటుల నున్న యాకాశ మా యా పేరు లతో వ్యవహరింపఁబడినట్లుగా నవిద్యచే నావరింపఁబడిన చైతన్యము జీవసంజ్ఞచే వ్యవహరింపఁబడుచున్నది.

ఇది యెట్లు పొసఁగును. సూర్యునకు రాత్రి సంబంధ మగు చీఁకటియావరణ మెన్నఁడైన గలదా? విశుద్ధమై, ప్రబుద్ధమై, స్వయంప్రకాశమగు నాత్మకు మాయావరణ మెట్లుండును? అనఁగా లోకములో దినకరుని వలనఁ బుట్టిన మేఘము లతనికే యడ్డువచ్చుటలేదా? దట్టముగాఁ గూడిన యా మేఘములచే దినమే దుర్దినమై పోవుచున్నదిగదా యని సమాధానము. అట్లే శుద్ధమైనదయ్యు నాత్మ యజ్ఞానముచే గప్పఁబడుచున్నది. ఈ ప్రాణులయందుఁ జేతనాశక్తి యావర

మాత్మనిదే యని పెద్దలెఱింగి చెప్పుదురు. ఈ తత్త్వము పామరు లెఱుఁగలేరు.

## లింగదేహాది నిరూపణ ప్రకరణము.

స్థూలములో లింగశరీరము, దానిలోఁ గారణశరీరము నద్దానిలో మహాకారణశరీర మని (తుర్యము)నాల్గవదిగా నున్నది. స్థూలమింతకు ముందు నిరూపింపఁబడినది. ఇంకసూక్ష్మము వివరింపఁబడుచున్నది. సూక్ష్మ మగు భూతాంశములు, ప్రాణము లైదు, నింద్రియము లైదు, నంతఃకరణముఁ జేరి లింగశరీర మయినది. దీనియొక్క వాసనాసముదాయమే కారణశరీరము. బుద్ధి నాశ్రయించిన యీ వాసనాప్రవృత్తియే తురీయమైన మహాకారణశరీరము. తత్సారభూతమైన బుద్ధియందుఁ బ్రతిఫలించిన శుద్ధచైతన్యమే జీవుఁ డనబరఁగు. ఈ శరీరమునందు నేనని స్ఫురించునదియే యీ జీవుఁడు.

కదలుచున్న తరంగములయందు సూర్యుఁడు కదలుచున్నట్లుండును. అట్లే చైతన్యమునందుఁ జిత్తచాంచల్యముచే జాంచల్య మేర్పడినది. కాంస్యాది పాత్రలయందుఁ బ్రతిఫలితమైన సూర్యుని తేజస్సు గృహమునఁ బ్రవేశించి యితర పదార్థములను బ్రకాశింపఁ జేయుటలేదా? అట్లే చిత్తుయొక్క ప్రతిబింబము బుద్ధులయందుఁ బ్రవేశించి జీవత్వమునుబొంది నేత్రాదీంద్రియముల మార్గముద్వారా బయటనుండు శబ్దాద్యర్థములను బ్రకాశింపఁ జేయుచున్నది.

అరఁటి, సంపంగి, జాజి మొదలగునవి యే నీటివలనఁ బెరుగుచున్నవో యా నీటివలననే తద్వ్యతిరేక రసగంధములు గల ముల్లంగి, యుల్లి, వెల్లుల్లికూడఁ బెరుగుచున్నవి. ఒక్క సూత్రధారుఁడే తా డాగియుండి త్రాళ్ళను నిపుణముగ లాగి యొకకాలమునం దనేకములగు బొమ్మలను దెరమీఁద నాడించుచున్నాఁడు. బెల్లము కలకండ చక్కెర భిన్నములయ్యు, నొక్క చెఱకుయొక్క వికారములేకదా! కేయూరకంకణాదులు బంగారు వికారములే. అట్లే వేఱువేఱునామములు వేఱు వేఱు రూపములు వేఱువేఱు వృత్తులు కలిగి యింద్రియములకు విషయమైన యీ జగమంతయు నొక్కయాత్మచేతనే కదలి యాడుచున్నది.

భుజముమీఁదనున్న యన్నము భుజముమీఁదనే యుండఁగా నడచువానికి బడలిక యాఁకలి తగ్గదు. అన్నము తిన్న వెనుక యాఁకలిభయము బాధ యుండవు. అట్లే మనుజులందు మాతంగములందు మహిషములయందుఁ బందులయందు ననుస్యూతముగా నున్న జగదీశ్వరు నెవ్వఁడు చూచునో యాతం డొక్కఁడే యద్వయానందము ననుభవించును. ప్రొద్దుపొడుచుటతోడనే జనులు తమ తమ పనులయందుఁ బ్రవర్తింతురు. వీరి పనుల నాసీరజాప్తుఁడు చేయను జేయఁడు, చేయింపను జేయింపఁడు. అట్లే యాత్మయు వ్యవహరించుచున్నాఁడు. నిప్పులోఁ గాల్చిన యినుపకడ్డీని సమ్మెటచేత బాదినను లోనున్న యగ్గికీ దెబ్బల బాధలేదు. మొద్దును గొడ్డళ్లచేఁ బగులఁ గొట్టినను లోన డాగియున్న యగ్గికీ దెబ్బలవలన ఖేదములేదు. శరీరసంబంధ

అరఁటి, సంపంగి, జాజి మొదలగునవి యే నీటివలనఁ బెరుగుచున్నవో యా నీటివలననే తద్వ్యతిరేక రసగంధములు గల ముల్లంగి, యుల్లి, వెల్లుల్లికూడఁ బెరుగుచున్నవి. ఒక్క సూత్రధారుఁడే తా డాగియుండి త్రాళ్ళను నిపుణముగ లాగి యొకకాలమునం దనేకములగు బొమ్మలను దెరమీద నాడించుచున్నాఁడు. బెల్లము కలకండ చక్కెర భిన్నములయ్యు, నొక్క చెఱకుయొక్క వికారములేకదా! కేయూరకంకణాదులు బంగారు వికారములే. అట్లే వేఱువేఱునామములు వేఱు వేఱు రూపములు వేఱువేఱు వృత్తులు కలిగి యింద్రియములకు విషయమైన యీ జగమంతయు నొక్కయాత్మచేతనే కదలియాడుచున్నది.

భుజముమీఁదనున్న యన్నము భుజముమీఁదనే యుండఁగా నడచువానికి బడలిక యాఁకలి తగ్గదు. అన్నము తిన్న వెనుక యాఁకలిభయము బాధ యుండవు. అట్లే మనుజులందు మాతంగములందు మహిషములయందుఁ బందులయందు నను స్యూతముగా నున్న జగదీశ్వరు నెవ్వఁడు చూచునో యాతం డొక్కఁడే యద్వయానందము ననుభవించును. ప్రొద్దుపొడుచుట తోడనే జనులు తమ తమ పనులయందుఁ బ్రవర్తింతురు. వీరి పనుల నాసీరజాప్తుఁడు చేయను జేయఁడు, చేయింపను జేయింపఁడు. అట్లే యాత్మయు వ్యవహరించుచున్నాఁడు. నిప్పులోఁ గాల్చిన యినుపకడ్డీని సమ్మెటచేత బాదినను లోనున్న యగ్గికీ దెబ్బల బాధలేదు. మొద్దును గొడ్డళ్ళచేఁ బగులఁ గొట్టినను లోన డాగియున్న యగ్గికీ దెబ్బలవలన ఖేదములేదు. శరీరసంబంధ

## నాదానుసంధాన ప్రకరణము

ఒక్క క్షణమో క్షణార్థమో స్వస్వరూపానుసంధానము చేసికొనువానికి నంతలోనే దక్షిణ కర్ణమునందు శబ్దమొక్కటి యనాహతమైనది, (దేనియందుఁ గొట్టఁబడకుండఁగనే సహజముగా వినఁబడునది) వినఁబడును. భేరీ మృదంగ శంఖాద్యాహత నాదములందే మనసు క్షణము రమించుచున్నది. మధువువలె మధురమై స్వచ్ఛమైన యనాహతనాదమునందు రమించుట వింతయా? చిత్తము విషయములనుండి యెంతగా విముఖమైపోవునో యంత నిశ్చలమగును. అంతగా వేణునాదమువంటి నాద మెడతెగకుండ వినంబడుచుండును. ఆ నాదముననంతర్లీనమైన జ్యోతియున్నది. ఆ జ్యోతియందు మనస్సులయము పొందెనేని మఱి మఱుపుట్టువు కలుగదు. నాదానుసంధానము కలిగిన చిత్తలయమువలనఁ బరమానందము కలుగుచున్నది. నాదానుసంధాన ముత్తమ మని యెఱింగి సాధకుఁడు నాదానుసంధానపరుండై యుండుట యొప్పు.

## మనోలయ ప్రకరణము

సంసార దావానలమున మాడిమాడి నానాయోనుల యందుఁ బుట్టి చచ్చుటచే జననమరణ క్లేశ మనుభవించి యనుభవించి యున్న చిత్తమునకుఁ బరమానందము లభించెనేని మఱియెందుకడకు నెన్నఁడును జలింపదు. అద్వైతానంద పరిపూర్ణుఁడై 'ఇదియేమి? నేనెవఁడను? ఎవ్వరివాఁడను?' అను విచారముతోఁ దిరుగుచుండునో యపుడే సోలిపోవును.

చిరతరమైన యాత్మానుభవముచేతఁ జేత మాత్మాకారము నొందుచున్నది. నది నీచమార్గమునఁబోక తనయందు దా నమరియుండినఁ దానే సముద్రమగునుగదా. ఆత్మయందుఁ బ్రవేశించిన మానసము తిరిగి విషయభోగముల నపేక్షింపదు. పాలలోనుండి విడివడిన నేయి తిరిగి పాలలోఁ గలియుటలేదు గదా. దృష్టియందును ద్రష్టయందును దృశ్యమందును నేది యనుశ్రితమై వెలుఁగుచున్నదో యందుఁ జిత్తము లయించె నేని వృత్తిరహిత మగుచున్నది.

ఆత్మావలోకనంబున దృశ్యద్రష్టృవిభేద మడంగు చున్నది. అసమ్ముఖమునం దీ స్థితిరాదు. కేవల ద్రష్టగా నున్న యాపరమాత్మయందు ద్రష్ట మొదలగు త్రిపుటి యేర్పడు చున్నది. ఈ త్రిపుటి లయ మొందిన పిదప నొక్క దృక్కు మాత్రము మిగులును. అద్దమునందు ముందువెనుకలుగా ముఖమున కెదురై ప్రతిబింబము నిలిచియున్నది. అద్దము నష్టమైనను ముఖమందే ముఖముండును. అట్టులే యాత్మయుఁ దనయందుఁ దా నమరియుండును.

## ప్రబోధప్రకరణము

బెల్లపుగడ్డయందున్న మాధుర్యము దానియొక్క సూక్ష్మాంశమైన యణుమాత్రమునందుఁగూడ గలదు. కావున గుడమునుండి మాధుర్యమును వేఱుచేయ వలనుపడదు. అట్లే కర్పూరమునకు వాసనకు భిన్నభావము లేదు. ఆత్మస్వరూప మైన మనసుగల పుణ్యాత్మునకీ జగమంతయు నాత్మమయ

మగుచున్నది. నిద్దురయొక్క మొదటను, జాగ్రత్త యొక్క చివరను గలిగిన భావానుభవము లోన స్థిరమయ్యేనేని నద్వయానందము ప్రాప్తించును.

అతిగంభీరము నపారము నగు నానందసాగరమునందు కర్మ మను వాతముచే జీవుఁడను తరంగము స్ఫురించుచున్నది. చైతన్యసూర్యుఁడు పెద్దకాంతితో నుదయించి యెల్లెడఁ గిరణ ప్రసారము చేయుచుండఁగా నంతట జీవత్వ మను మృగతృష్ణ (యెండమావులు) నానావిధములుగా లేనిదై స్ఫురించును. దేని యందు నీ జగములు లేనివయ్యు నున్నట్లు తోఁచునో యొక్క మాటు దేనిం దర్శించుటచే ననిర్వాచ్యమైన యీ యసద్రూపము విలయమునందునో, యట్టి పరమానందసముద్రము నందు బాహ్యాభ్యంతర పరిపూర్ణుండై యెవ్వఁడు మునుఁగునో యాతఁడు పైన లోపల నంతట జలపూర్ణమైన కలశము గంగలో నున్నట్లు తాను బ్రహ్మమందు బయటలోపల నాత్మ జ్ఞాన పరిపూర్ణుఁడై యుండును.

పూర్ణు లందఱకంటెఁ బూర్ణుఁడై శ్రేష్ఠు లందఱ కంటె శ్రేష్ఠుఁడై యొప్పి, పార మెఱుంగరానివాఁడై వీచీతరంగ విరహితమైన ప్రజ్ఞానసుధాసాగరుఁడై కోటిసూర్యప్రకాశమానుఁడై స్వానందైకరసస్వరూపుఁడై పరుండైన హరియందు నిమగ్నమైన మనసు కల ధన్యులకు నేనని నీ వని జగత్తని విడి విడిగాఁ దోఁపదు.

## ద్వి ధా భ క్తి ప్ర క ర ణ ము

చిత్త ముత్పత్తియైనపుడు మెఱుపువలె బోధోదయము కలుగుచున్నది. అదియే స్థిరమగునెడలఁ జిత్తము పరిశుద్ధమగును. చౌడుసున్నముతో నుదికినఁగాని వస్త్రము శుద్ధము కాదు. కృష్ణపదాంభోజభక్తిచేఁ గాక వేఱొండు మార్గమున జిత్తము పరిశుద్ధముకాదు.

భస్మముచేఁ బరిశుద్ధముచేసిన యద్దమునందు ముఖము చక్కఁగఁ గానవచ్చును. అట్లే శుద్ధమైన చిత్తమునందు జ్ఞానా విర్భావము కలుగును.

శ్రీహరికి మూర్తమనియు నమూర్తమనియు రెండు రూపము లని హరిభక్తిచేత జ్ఞానులయినవారు తెలిసికొను చున్నారు. ఉపనిషత్ప్రసిద్ధ మగు నీరూపద్వయప్రాప్తికి రెండు విధములయిన భక్తిమార్గములున్నవి. ఈ రెండు మార్గముల చేతను బ్రారబ్ధానుసారముగఁ గ్లేశముచేతనో క్లేశములేకుండఁ గనో మోక్షము సిద్ధించును.

హరిభక్తి స్థూలమని సూక్ష్మమని యిరుదెఱఁగులు. తొలుత స్థూలముగా నుండి క్రమముగా నద్దానినుండి సూక్ష్మ మగును. ఆశ్రమమున కుచితమైన ధర్మాచరణము, నిత్యము శ్రీకృష్ణ ప్రతిమార్చనోత్సవము, వివిధోపచారములు సలుపుచు హరిభక్తులతో నెల్లపుడు సహవాసము, కృష్ణ కథా సంశ్రవణమునందు మహాసంతోషము, సత్యమైన వాక్కు, పరధన పరదారా పరాపవాద పరాఙ్ముఖత, పొల్లుమాటలు

వినుట యందు చెవిపోటు మొదలగు లక్షణములు, కృష్ణభక్తునియందుఁ గానఁబడుచుండును. భక్తులకుఁ దీర్ఘాభి గమనమునందు ప్రీతి మెండు. యదుపతి కథాశ్రవణము లేనినా డాయువు వ్యర్థముగా గడచెనుగదా యని భక్తులు చింతింతురు. ఈ లక్షణములు కలిగి భజన చేయుచుండువారికి గ్రమంబున సూక్ష్మభక్తి యుదయించును. శ్రీహరిమూర్తి పరమభక్తులెల్లపుడు స్మరించుచుందురు. మానస పూజా పరులై యుందురు. విజననివాసమున నిచ్ఛగలవారై సంగము వర్జింతురు. సత్యవ్రతులై సమస్త జంతువులయందుఁ గృష్ణునిఁ జూచుచుందురు. ఏభూతములకేని భక్తులెన్నఁడు ద్రోహముఁ దలపెట్టరు. సమస్త భూతములయందు దయగలవారై యుం దురు. ఆయాసపడక కలుగు లాభమునకే సంతుష్టి పడు చుందురు. దారాపుత్రాదులయందు మమకారశూన్యులయి యుండుటచేఁ గ్రోధరహితులై నిరహంకారులై యుందురు.

ప్రపన్నులయిన భక్తులు చల్లగా మాటాడుచుందురు. నిజ నిందాస్తుతులయందు సమబుద్ధిగలవారై యుందురు. సుఖ దుఃఖములు శీతోష్ణములు మొదలగు ద్వంద్వములు సహిం తురు. ఆపదలయందు ధైర్యము వహింతురు. నిద్రాహారములయం దాదరములేనివారై జనసంసర్గము నొల్లక యొక్క మాటా డుటకైన నవకాశము లేనివారై కృష్ణస్మరణముచే శాంతింతురు.

వేణుగానము గాని సంగీతము గాని వినఁబడినంతనే యానందావిర్భావము సాత్త్విక భావోద్రేకము భక్తుల యందుఁ గానవచ్చును. ఆ భక్త్యుద్రేకమునందు గలిగిన పర

మానందము స్థిరమైనకొలఁది మదముచే నున్మత్తమైన దంతి దశవంటి దశ పుణ్యాత్ముఁ డనుభవించును. జంతువులయందు భగవంతుని, భగవంతునియందు భూతములను గ్రమముగాఁ జూచువాఁడై ధన్యుఁడు హరిదాసవర్యుండై పూజాభాజనుం డై యుండును.

## ధ్యానవిధిప్రకరణము

మనోహరమైన యమునానదీకూలమునఁ గమనీయమైన కల్పవృక్షమూల సమతలంబున వ్యత్యస్త పాదారవిందుండై నిల్వంబడియున్న గోవిందునిఁ బరమానందముగ సేవింపు మో డెందమా! నీలమేఘశ్యాముఁడు, విశ్వప్రకాశక నిజతేజోవిలాసుఁడు, పీతాంబరధారి, చందన కర్పూరలిప్త సర్వాంగుఁడు, ఆకర్ణపూర్ణ నేత్రుఁడు, కుండలయుగ మండిత శ్రవణయుగ్ముఁడు మందస్మిత ముఖకమలుఁడు, కౌస్తుభోదారమణి హారుండు, నిజతేజోజ్వలితవలయాంగుళీయకాదిస్వాలంకారుండు, గళవిలులిత వనమాలుండు, కలికలుషాపహారకుఁడు ఆహా! ఎంత మధురమూర్తి! కుమారకిశోరుండు మంజులమగు శుకకోకిలారవంబులు సెవులపండువు సేయుచుండఁ, గుంజాపుంజాన్వితంబైన కొండెసిగఁ దాల్చి గొల్లపిల్లవాండ్రతో భుంజానుండై కుంజాంతరమున విహరించు నా కంజాక్షుని స్మరించి ధన్యులు కృతార్థు లయ్యెదరు.

మందారపుష్ప వాసితుఁడై మందానిలుం డా పరమానందుని సేవించుచున్నాఁడు. ఎవ్వని పాదారవింద మకరందము

మందాకినియో, యమ్మహాపురుషునకు, మహానందదుండగు నందసూనున కభివందనం బాచరింపుము. ఆ చందనచర్చిత నీలకళేబరుండు, సురభీకృత దిగ్వలయుండు, సురభిశతావృతుండు, సురభీతి పరిహారకుండు నసురభీమపరాక్రముం డగు యదు వీరుని స్మరింపుము.

ఆ వాంఛితఫలప్రదుని దయాసముద్రునిఁ గందర్ప శతకోటి లావణ్యమూర్తిని శ్రీకృష్ణునిఁగాక నేత్రయుగళము నకు విషయము చేయఁదగిన వస్తు వీ లోకమునఁ గలదా? మనోఽభిరామము, పుణ్యాత్మము, నతిసరసము నగు హరికథా లాపము నుజ్జగించి కర్ణములు గ్రామ్యకథలు విన నిచ్ఛగించునా? శాశ్వతమైన శ్రీకృష్ణ పరబ్రహ్మము విషయమై యుండఁగా క్షణికములు పాపహేతువులు నగు నన్యవిషయ ములపైఁ బ్రవృత్తి గలుగుట యది యింద్రియముల దౌర్భా గ్యము గాదా?

## సగుణ నిర్గుణముల కైక్యము నిరూపించు ప్రకరణము

శ్రుతులయందు మహాపురాణములయందు గూఢముగా జెప్పఁబడిన సగుణ గుణాతీతైక్యము శ్రీశంకర భగవత్పాదా చార్యులు విశదమగునట్లు విపులముగా బోధింతు మని ప్రతిజ్ఞఁ జేసి కంఠోక్తిగాఁ బలుకుచున్నారు.

సకల భూతాంతర్యామి, జ్ఞానమయుఁడు, సచ్చిదానంద స్వరూపుఁడు, ప్రకృతికంటెఁ బరుండైన పరమాత్ముఁడు నొకఁ డున్నాఁడు. ఆతఁడే యీ యదుకులతిలకుండైన కృష్ణుండు.

# కీ. శే. మాడభూషి చూడమాంబా ప్రశస్తిః

(శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మీసుందరాంబా విరచితా

యోషాచూడామణి ర్మాడభూషీయా వైష్ణవీసతీ
శేషాంబాయా స్సఖీ హిందుసుందరీఖ్యాతవర్తనా॥ ౧

విద్యావతీ సుజనగేయవిశుద్ధశీలా
దీక్షావతీ గురుపదాంబుజ పూతఫాలా
శ్రద్ధావతీ శ్రితజనేష్టవిధానలోలా
చూడాంబికా పరమభాగవతీ నిగూఢా॥ ౨

భీమాకారా హృదయసదనాక్రాంత మాకాంతకాంతా
రాద్రీమూర్తిః పరహితపరా సాత్త్వికీ లోకమాతా
కాళీలీలా జలజనయనస్తోత్రసంపూరితాస్యా
చూడారత్నం సకలగణితం కాకినాడేందిరాయాః॥

అష్టాక్షరీజపపరా పరమార్థసారా
హేమాంబికాచరణపంకజచంచరీకా
భక్తిప్రపత్తి పరిభావిత సాత్త్వికాత్మా
వ్రీడావతీ కులమణిః ఖలు చూడమాంబా॥ ౪

పరోపకారాయ పరాపవాదం
వపుర్వహంతీ గురుకార్యసిద్ధ్యై
కృతీసతీ స్వాత్మపదం ప్రపేదే
నిమిత్తజన్మా ఖలు చూడమాంబా॥

## శ్లోకతాత్పర్య సంగ్రహము

1. యోషాచూడామణి ఆంధ్రదేశమున బ్రాహ్మణకులమున వైష్ణవశ్రేష్ఠులగు మాడభూషివారి కోడలు, బాలాంత్రపు శేషమాంబగారి చెలికత్తె. హిందూసుందరి పత్రికాధిపురాలుగాఁ బ్రసిద్ధికెక్కిన చూడమాంబగారు యోషాచూడామణి యని చెప్పఁదగిన వర్తన కలిగిన మహనీయురాలు.

2. విద్యావతి విద్యావంతురాలు, సజ్జనులచేఁ గీర్తింపఁదగిన పరిశుద్ధమైన శీలముగలది, కార్యదీక్షగలది, గురుపాద పద్మములకు మ్రొక్కుటచేఁ బవిత్రముగాఁ జేయఁబడిన ఫాలభాగము గలది. ఈ చూడమాంబగా రాడంబరములేని యంతరంగ భక్తురాలు.

3. భీమాకారా-భయంకరమైన యాకారము గలదైనను హృదయమందు శ్రీకాంతుఁడు నిండియుండుటచే, కాంతామనోహరమైనది. రౌద్రీమూర్తిః- రుద్ర సంబంధమైన కోపముతో నున్నట్టు కనఁబడు మూర్తి గలదైనను పరులకు హితమొనర్చుటయందు సాత్వికభావముఁ దాల్చి యెల్లరకుఁ (లోకమాత-లక్ష్మి) దల్లివంటిది. కాళీలీలా - నల్లనిరూపము గలదైనను జలజనయన స్తోత్రముతోఁ బూరితమైన ముఖము గలది. అనగా విష్ణుస్తోత్రము చేయునది. కాకినాడ పురలక్ష్మికీ యమ చూడారత్న మని యెంచఁదగినది. ఇందు శివకేశవ సామరస్యము శబ్దసారస్యమును బట్టి యూహింపఁ దగినది. కేవల విష్ణుపరాయణ మగు వంశమునఁ బుట్టియు శివకేశవ

భేదము, వైష్ణవ స్మార్తభేదము, వీస మెఱుంగకుండఁ గడపు కొన్న ధన్యురాలు.

4 అష్టాక్షరీ జపపరా- హేమాంబికా చరణపంకజ చంచరీకా, హేమాంబికా- విద్వాన్ కవితిలక కాంచనపల్లి కనకాంబగారివలన మంత్రదీక్ష వహించినది.

5 పరోపకారము కొఱకుఁ బరాపవాదముల పాలయి నదేగాని స్వవిషయమున నెట్టి యపవాద మెఱుఁగనిదియనుట. గురుకార్యముల కొఱకు, గొప్పకార్యముల కొరకు శరీరమును ధరించినది. అనగా బ్రదికి నన్నినాళ్ళు పెద్దల ననుసరించుట యందు నాశ్రితుల కుపకరించుట యందు కాలముగడపిన దనుట.

---

* ఈ చూడమ్మగారి వృత్తాంతము మ. రా. రా. కాళ్లకూరి శేషయ్య పంతులుగారి యుపోద్ఘాతములోఁ జూడదగును. ఈ సాధ్వి కీ॥ శే॥ సుందరమ్మగారిని తల్లివలెఁ బెంచినది. "హిందూసుందరి" పత్రికా ప్రచారమునకుఁ దోడుపడినది.

# FLOWER GARLAND

( From the Telugu Flower Garland of
Kavitilaka K. Kanakamba Garu )

BY THE LATE

**Mrs. K. Maha Laxmi Sundaramma,** M. A., L. T.

## THE HOT WESTERN GALE

Lo! the gale of the West is laden with dust.
Even the eyes of the wise cannot see the ways.

At every step there is a false step,
With his back to the East and face to the West,
The pilgrim advancing against the wind
Cannot catch the voices behind.

The heart is dried and the face is fried,
Dragging along the weary way,
Sin or merit he spends the day.
Not a drop the tongue to wet
Not a tree the head to protect.

## THE TREE

The Tree stands bare:
The leaves are rare:
Worms unseen eat the roots,
Shrivelled up are the off-shoots
Fruit unripe the monkeys pluck
Tanks and wells the Sun rays suck
The trunk is swinging
The whirlwind ringing
Here and there is blossoming
A flower with sweet aroma quickening
Pilgrim! take the perfume,
To all quarters, to every home

*Reprint from "Amrita Sandesh" Nov. 1938*

# "Stree Ratnam"

OR

## GEM AMONGST WOMEN

BY

**Sreemati M. INDIRA-SUNDARI-DEVI**

ALIAS

**[The late Sreemati Mahalakshmi Sundaramma Garu,**

M. A., (Double) L. T.]

All married women in India, are expected to be "Pativratas". A "Pativrata" is one who loves and adores her husband unconditionally; and such a woman is regarded as a gem amongst women.

Such women are rare even as gems. Baser stones are abundant and baser metals too. The duties of a wife as laid down in the ancient works are summarised herein to show the degree of cultural refinement and moral development of our ancestors.

### OUR HOME

The human body is the abode of God. More so the Home. The Home is the repository for the "Holy Sacrificial Fire" and the Domestic Gods.

The lady of the house should see that her home is well kept and well smeared, three times in the day.

The floor should be decorated with rice flour drawings (Rangavalli).

The decorated Home attracts the husband towards it in preference to other places of interest and becomes for him the "Sweet Home." Formerly there was the fear of the Grihastha (householder) running away from the home out of Vairagyam or spirit of renunciation in search of God. A decorated home

riveted even wise men to Grihasthasrama (Married life). Nowadays gentlemen who feel reluctant to remain at home and seek rest, recreation, refreshment and refrigerants elsewhere, can be fixed to their homes if the mistress of the house can make her home pleasant and decent.

## THE HOUSE-WIFE AS MISTRESS OF THE HOME

A Sati who has an unconditional devotion for her Lord regards all that are near and dear to him with respect and consideration according to their deserts. The family priest, the husband's father, mother, sister, the son-in-law of the family, the male and female servants of the home deserve due regard.

It is said that "consultation is a pre-condition to co-operation." The prudent housewife manages the house and commands the respect of all by consulting the deserving persons about the details of the family affairs.

A kind word or a little act of goodness wins the hearts of people. Hot temper and harsh expression will undo good deeds. Good manners and affable nature are the essential accomplishments of a happy house-wife.

## THE PLEASURE GARDEN

The gardening in the house compound should be conducted under the direct supervision of the house-wife—greens, vegetables, ginger, sugar cane, mustard flower plant and creepers of various sorts—fit for decoration of person and home and for the worship of the Gods—should be reared in an artistic manner in the house garden.

A small pond or a big well must be surrounded by bowers, and stone seats on the banks. The pond

itself can be made beautiful by growing lotuses and aquatic plants, and various kinds of fish and swans.

The modern housing conditions and the high rents in the cities and the over-crowding of the rich and poor alike will not give much room for private gardening in houses. Where there are facilities, the prudent housewife, can make her pretty garden beautiful, as well as useful.

## UNDESIRABLE ASSOCIATES OF THE HOUSEWIFE.

A respectable housewife should not make intimate acquaintance with, and give long interviews to, washer women, midwives, female mendicants, palmists, sooth sayers, hardened prostitutes, Women druggists dealing in drugs for effecting criminal abortions, and for winning the affections of the husband.

Modern conditions add a few more to the list. The advocates of free love and divorce; the leaders of the womens' movement who preach that women have an interest and purpose of their own without having any thing to do with men the " single woman who wants to remain single shirking the responsibility of family life and the sterile woman who practises and popularises the methods of remaining sterile avoiding responsibilities of holy motherhood, deserve to be shunned by those housewives who desire to lead a happy and peaceful life with their husbands.

Long association with undesirable persons even for the fun of it will create a jarring note in the harmony of a happy home life.

## HOUSE-WIFE AS HOSTESS

On hearing the voice of her husband the house wife rushes to the threshold to receive him with sweet

looks and sweet words. She herself—without deputing her servant-maids for it—washes the feet of her husband, receives with respect whatever he brings home and awaits his orders.

She attends upon him at the time of his dinner She serves him according to his taste. She carefully studies his dietics so that she can advise her cooks about the things to be made and those to be avoided from the point of his health and taste. Neglect in attending to the details of the husband's bath, sleep and food is fraught with serious consequences in the long run. The tendency of the modern housewife to evade this item is not prudent.

The housewife should never approach her husband (sitting alone) without decently dressing and decorating herself. She should never keep herself untidy for, seeing her in that condition her husband may get disgusted with her and avoid her.

## THE HOUSEWIFE AS ADVISER

The effective, soft, persuasive, and entreating but none the less effective advice of a loving wife is taken as the ideal form of teaching by poets and philosophers. The master poets have done their very best to make the nearest approaches to the housewife's affectionate teachings in their works of art (kavyas).

When the husband is spending his money, much beyond his means and when he is lavishing his wealth upon undesirable persons and causes; the housewife should advise him mildly in private. She should not put him to shame when he is in the company of his friends and relations.

A good housewife's advise is considered by all wise men to be more potent than the mandate of the Vedas or the monotonous mutterings of the Puranas.

—Reprint from 'Amrit Sandesh', July 1939.

# శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మి
## సుందరాంబ నిర్యాణ సమయమున

[శ్రీమతి విద్వత్కవితిలక కాంచనపల్లి కనకాంబగారి; సంతాపము]

గీ॥ నీ పరిమాణబుద్ధి నీ త్రికరణశుద్ధి
నీదు శక్తి యుక్తి నీ మృదూక్తి
నీ విరక్తి రక్తి నీపతిభక్తియు
స్త్రీలలామములకు మేలుబంతి. ౧

క॥ మిన్నేటిమచ్చు వెన్నయు
వెన్నెల తెలివియును గళలు విన్నాణముగా
నన్నలువ కలిపి సుందరి
ని న్నిర్మాణమ్మొనర్చె నిజధీగరిమన్. ౨

చ॥ ఇరువదియైదు వర్షములకే శతమానము నిండె నీకు సుం
దరి వరలక్ష్మి శారద, ముదంబునఁ గొల్వఁగఁ జెన్ను మీరు శాం
కరిఁ బురుడించుచున్, సిరియు జ్ఞానము శక్తియుఁ గల్గి వెల్గుచున్
హరహర! మండియారతిగదా, జగమంతయు మున్గఁజీఁకటిన్. ౩

మ॥ కలిలో నాలవపాలు ధర్మమని వక్కాణింత్రు నీ పాలిటన్
వెలయున్ ధర్మమునాల్గుపాళ్ళనుచువి ద్వేషించి నీయాయువున్
గలియే మ్రింగెను పంకజాతములు కందన్ బోవునే యెందునే
దోలిజామే జలజాప్తుఁడాకసమునందున్ ముందు వెల్గ దగ

ఉ॥ అంతరమందు బాలను నిరంతరమున్ భజియించువారు బా
లాంతరులై త్రిలింగ వసుధామరులందుఁ బ్రసిద్ధి కెక్కినా
రెంతయు సుందరాంబ జనియించెను వారలలోన స్వాంత మ
త్యంతము శ్రీసదాశివపదంబుల మోదమునొంద విందుగన్.

కాళ్లకూరి మహాలక్ష్మిసుందరాంబా నిర్యాణమ్
శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠ సంతాపః
అధిపతి, వైద్యరాజ, పండితరాజ, దంటు సుబ్బావధానినా ప్రకటితః

అంతరంగం శ్రియోరంగ మిందిరామందిరం ముఖమ్
సర్వాంగం మంగళం యస్యా బాలాత్రిపురసుందరీ. ౧

శ్రీ బాలాత్రిపురసుందరి యొక్క యాకారమగు నీ యమకు నంతరంగము సరస్వతీ దేవికి నాట్యస్థానము (రంగము) ముఖము లక్ష్మికి స్థానము, సర్వాంగము మంగళమే, సర్వ మంగళ పార్వతి యనుట—

బాలాంతరకులోద్భూతా బాలా మంత్రస్వరూపిణీ
నందినీ సుందరార్యస్య శేషభూషణభూషణా. ౨

బాలాంతరపు సుందరరామయ్యగారిపుత్రిక సంతతము బాలామంత్రజప మొనర్చుటచే బాలామంత్రస్వరూప మనవచ్చును. శేషభూషణుఁడైన శివునకుఁ దాను శివసాయుజ్య మొందుటచే భూషణమైనది. అనగాఁ దదర్ధాంగి యగు శక్తిలో లీనమైన దని సూచన—

శేషామాత్యద్వితీయా యా చాఽద్వితీయా సతీజనే
శేషాంబాచిత్తసంతోషా శేషాఽశేషదివౌకసామ్. ౩

కాళ్లకూరి శేషయ్యపంతులుగారిభార్య, సతీజనములో సాటిలేనిది. సతియనగా దర్శనముచేతనే పాపమును బోఁగొట్టునది. శేషమ్మగారికిఁ దా బ్రతికినన్నాళ్ళు సంతోషము కలుగఁజేసినది. నేఁడు కీర్తిచేతనే. అశేషమైన దేవతలయొక్క శేషా - ప్రసాద స్వరూపము - అనగా సమస్త దేవతల ప్రసాద స్వరూపురాలై యవతరించిన దని యభిప్రాయము.

ప్రత్యక్షం లలితారూపం సంప్రాప్త మనసీతలే
స్త్రైణధర్మ ప్రచారార్థం పాతివ్రత్యపురస్సరమ్. ౪

పాతివ్రత్యము మొదటిదిగా సమస్తధర్మములు స్త్రీల కాచరించి చూపుటకు లలితా మహాదేవియే యీ తనువు నెత్తినదనుట.

విఖ్యాతా సా మహాలక్ష్మీ సుం[1]దరీ సుందరీమణిః
హేమాం[2]గీ హేమ[3]వాక్చేష్టా హేమాం[4]బానయనోత్సవా

1 స్త్రీరత్నము 2, 3, బంగారమువంటి చాయ, వాక్కు చేష్టలు బంగారమువంటివి, ప్రశస్తమైనవి. 4 హేమాంబా కాంచనపల్లి కనకాంబగారికి నయనోత్సవమైనది అని శ్రీమహాలక్ష్మీ సుందరాంబ విఖ్యాతయైనది.

పత్యౌ భక్తిశ్శ్రుతౌరక్తి రాసక్తి ర్గురుసూక్తిషు
విరక్తి రింద్రియార్థేషు మహాలక్ష్మ్యా మహాగుణాః. ౬

పతియందు భక్తి, వేదమందు రక్తి, గురుబోధములందాసక్తి, దృశ్యప్రపంచమైన యింద్రియార్థములయందు విరక్తి మహాలక్ష్మియొక్క మహాగుణములు.

స్వధర్మం పరధర్మంచ సమాలోచ్య విచక్షణా
స్వధర్మే సుస్థితా ప్రితా, పరధర్మం పరిత్యజత్. ౭

ప్రాచీనమైన స్వధర్మమును సంస్కృతాంధ్రవిద్యలచేతను, నవీన పరధర్మముల నాంగ్లవిద్యలచేతను బూర్ణముగా నేర్చి వివేకముచేఁబరధర్మమును బూర్ణముగా వదలి, సంతోషముతో స్వధర్మమును బూర్ణముగా నాచరింపఁ బూర్ణదీక్ష గైకొనినది.

అర్వాచీనాపి ప్రాచీనా గృహిణ్యపి తపస్వినీ!
కాళ్లకూర్ శ్రీ మహాలక్ష్మీ పేశలాపి దృఢవ్రతా. ౮

అర్వాచీనా=ఈనాటిదైనను, ప్రాచీనా=ప్రాతకాలము నాటి సదాచారములయం దాసక్తి కలది, గృహిణ్యపి=రాగ ద్వేషయుతురాలుగా నుండదగిన కుటుంబినిగా నుండియు, తప స్వినీ=జపతపాదు లొనర్చునది, పేశలాపి=సుకుమార గాత్రము కలదియైనను దీక్షాకాలమున నుపవాసాది కష్టములను సహించునది.

ఆకారే చాంతరంగే చ గోష్ఠీప్రవచనేషు చ
స్వప్నేఽపి శ్రీ మహాలక్ష్మీ స్సతీ లక్షణలక్షితా.

త్రికరణములయందే కాక స్వప్నమునందుఁ గూడ సతీ లక్షణములతోఁ గూడిన దనుట.

---

## వ్యాకరణాంశము

చిత్రమున "శ్రుతౌ రక్తిః పతౌ భక్తిః" అనియును శ్లోకసముదాయ మున "పత్యౌభక్తి శ్శ్రుతౌ రక్తిః" అనియున్నది. సమాసమందు గాక విడిగా "పతౌ" అను రూపముండదని ప్రసిద్ధ మగుటచే "పతౌ" దో ముగాఁ దోచును. తప్పయినను "హాపితః క్వాసి హేసుభ్రు" అను భట్టిక ప్రయోగమువలెఁ గరుణ రసోచిత మని సహృదయులు నెఱుంగుదురు గాక పక్షాంతరమున 'సీతాయాః పతయే నమః" వలెను, భట్టోజీ మతానుసా ముగాను, సాధువని యనవచ్చు. నవీనమతవిరుద్ధ మగుగాక. రసప్రసక్తి గ చోట, వ్యాకరణభంగముకూడ నౌచితిని బోషించునని యాలంకారిక మతము.

## సుందరాంబా స్మృతి

గీ॥ కనకమాంబకుఁ బ్రాణంబుకంటె బ్రాణ
మగుచు జీవయాత్రకుఁ దగినట్టి మేటి
నెచ్చెలి యగుచునుండెనే పొచ్చెమింత
లేక; యెట్లోర్చు మహాలక్ష్మిలేని వెలితి ?

ఉ॥ మాకనకాంబ చెప్పఁదగుమాటలు గట్టిగ నచ్చఁజెప్పుచున్
నీ కిల ధైర్యపద్ధతులు నెమ్మిగఁగూర్పఁగలట్టి సత్త్వరూ
పాకృతిసుమ్మ; ప్రాజ్ఞతఁగలట్టి సుధన్యవు నీవుకూడ, నే
శోకముఁజెందఁబోకు మిఁకశుద్ధచరిత్రకు నాత్మశాంతియౌ.

సాహిత్యస్థాపక, వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు,
బి. ఏ., బి. యిడి.,
అధ్యక్షులు : స్నేహలతాకవితాసంఘము,
కొల్లాపురం సంస్థానము.

---

## సానుభూతి సభ

( కాకినాడ )

శ్రీవిద్యార్థినీ సమాజపు వ్యవస్థాపకురాలు గం॥ భా॥స॥ బాలాంత్రపు శేషమ్మగారి యేకైకపుత్రికా రత్నము కాళ్లకూరి మహాలక్ష్మీసుందరమ్మ M. A, L. T. గారి మృతికి సమాజపు సభ్యురాండ్రు పురస్త్రీలు సమావేశమై యామెయాత్మకు శాంతి కలుగుఁగాకయని భగవంతుని బ్రార్థించిరి.

మాతృదేవతకు, భర్తయగు శేషయ్యగారికి, శ్రీమతి సుందరమ్మగారి నిట్టి యభివృద్ధికిఁ దీసికొనివచ్చిన యధ్యాపకురాలు శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారికిని వారి కుటుంబమునకును దుఃఖశాంతి కలుగవలెనని భగవంతునిఁ బ్రార్థించుచు సానుభూతి తెలుపఁబడినది.

కీ॥ శే॥ మహాలక్ష్మి సుందరమ్మగారి పేరు చిరస్థాయిగా నుండుటకు నాప్తులవలన శక్తికొలఁది ధనము సేకరించి దానితో నేదో యొక విద్యావిషయిక కార్యము నాచరింపవలెనని యేకగ్రీవముగఁ దీర్మానింపఁబడినది. ఆప్తులు శక్తివంచనలేక యీ యుద్యమమును బ్రోత్సహింపఁ బ్రార్థితులు.

ఈరోజున శ్రీ సమాజపు యాజమాన్యమున నిర్వహింపఁబడు మహిళావిద్యాలయమునకు సెలవీయఁబడినది.

సమాజపు సభ్యురాండ్రు.

---

## మహాలక్ష్మి సుందరీ వియోగ విచారము

[సతి పులగుర్త లక్ష్మీనరసమాంబగారు]

ఉ॥ హాటకవిగ్రహంబు కడలందిన విద్దెలరూపు సజ్జనో
ద్ఘాటితబుద్ధి శక్తియవతారము సుందరి దానిసత్కళా
పాటవమెంతొ చూపకయె పాడొనరించితి పాత్రినో జగ
న్నాటక సూత్రధారి! నవనవ్యము లేమనవచ్చు నీకృతుల్-

గీ॥ కోటిగొంతుల నెత్తి గోల్గోలుమనుచు
విలపనము సేయుచున్నట్టి తెలుఁగుఁదల్లి
నిరుపమ దురంత దుఃఖంబు నరసియైన
నార్తి దిగద్రావ వమ్మ శేషమ్మతల్లి!.

క॥ శతవర్షంబుల నొనరుప
జతపడని త్వదాజ్ఞఁ దీర్చి షడ్వింశతికే
సతిసుందరి నిను జేరిన
దతులిత శాశ్వతసుఖంబు నందింపు హరీ!.

---

కీ. శే. కాళ్ళకూరి మహాలక్ష్మీసుందరాంబ స్మృతి.

గీ. అనఘమతి శేషమాంబ యేకైకపుత్రి
సుగుణవతియైన మహాలక్ష్మి, సుందరాంబ
మాతృదేవిని దుఃఖాబ్ధిమగ్నఁ జేసి
ప్రాణనాథు వియోగాగ్నిపాలు సేసి
దేశదౌర్భాగ్యమునఁ గటా దివికిఁ జనియె
మహితవిద్యావిశారద, మాన్యచరిత
యైన సోదరిఁ గోల్పోయె నాంధ్రలోక
మాహా నేగతి మఱువగా నగును మనకు.

—కవయిత్రిమణి: గుడిపూడి యిందుమతీ దేవి.

# శ్రీ మహాలక్ష్మీసుందరీ నిర్యాణము

గీ॥ పాతికేఁడులు నిండెనే పాటి వయసా?
సకలకళలను నేర్చి తాశ్చర్య మొదవ
అకట మూరేండ్లు నిండెనే యమ్మ నీకు?
సురిఁగిపోయితె మహాలక్ష్మిసుందరమ్మ! ౧

క॥ నెమ్మది విద్దెల నేర్చితి
'వెమ్మె' వైతివి, గురూక్తు లెంచుచుఁ దత్త్వం
బమ్మెయి నేర్చితి వింతకు
నమ్మను బోషింప భారమై పోయితివా? ౨

క॥ నీచుఱుకు, నీదుచకచక
నీచతురత, నీదునేర్పు, నీధాటియు, నీ
ధీచాతుర్యము, నీతో
నే చనెనా? లేక యిచటనే దిగఁబడెనా? ౩

గీ॥ నిన్నగాక మొన్నటిదాఁక నిన్ను గుఱిచి
దీవనలు వల్కు నానోట దిటవు దప్పి
నేఁడు నీ మరణమ్ము వర్ణింపవలసె
మూఁడునాళ్ళ ముచ్చటవయి పోయితమ్మ. ౪

గీ॥ ఐనఁ గానిమ్ము; పాపీ చిరాయు వనుట
ఎన్న సుకృతీ గతాయు వంచన్నకతనఁ
బాపులము గాన మే మిట్లు బ్రదికియుంటి
మీవు పుణ్యాత్మురాలవే యెంచిచూడ. ౫

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

# శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము, బెజవాడ

## సానుభూతి సభ

వయోవృద్ధులును, జ్ఞానవృద్ధులును, కర్మజ్యేష్ఠులును నగు బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనులుగారి యొక్క నిర్యాణమునకును, కాకినాడ హిందూసుందరీ పత్రికా సంపాదకురాలు బాలాంత్రపు శేషమ్మగారి ఏకపుత్రికా రత్నము శ్రీమతి కాళ్ళకూరి మహాలక్ష్మీ సుందరమ్మ, ఎమ్. ఏ.,ఎల్. టి. గారి యకాలమరణమునకును వారివారి కుటుంబములకు సానుభూతిని వెలిబుచ్చు నిమిత్తమై శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠము పక్షమున 27-7-41 తేదీ ఆదివారము సాయంకాలము 5 గంటలకు పీఠభవనమున పౌరమహాసభ గావింపబడెను. స్త్రీపురుషులు పెక్కండ్రు సభకు విచ్చేసిరి. బోధానంద తీర్థస్వామివారా సభ కధ్యక్షత వహించిరి.

విద్వాన్ దంటు పార్థసారథిగారు ప్రసంగించుచు, 'మాయాపీఠమున నొకటిన్నర సంవత్సరమునకుఁ బైగా బ్రహ్మశ్రీ పండితప్రవర మల్లాది రామకృష్ణ విద్వచ్ఛయనుల వారు భాష్యప్రవచనము గావించియుండిరి. వారినిర్యాణము వలన వారి కుటుంబమునకు శిష్యగణమునకేగాక యాంధ్ర దేశమునకే తీరనిలోటు వాటిల్లినది. ఆసేతుహిమాచలము తమ ప్రతిభావిశేషము వలన దమకును, దమ యాంధ్ర దేశమునకును కీర్తిగడించిన మహాపురుషులు. ఇట్టివారినిర్యాణమునకు మనము వగచుచు వారి కుటుంబమునకు సానుభూతిఁ దెలుపవలసి యున్నదనియు—

శ్రీమతి మహాలక్ష్మీ సుందరమ్మగారు పిన్నవయస్సు నందే సంస్కృతము నందును, తెనుగు నందును, ఎం ఏ. పరీక్షలనిచ్చి యల్. టీ. పరీక్షయందు తీర్ణురాలగుటయే గాక, కవితిలక, కవితావిశారద, విద్వాన్ కాంచనపల్లి కనకాంబ గారివలనఁ దత్త్వరహస్యముల నెఱింగి, పతిభక్తి, దైవభక్తి, ఆర్యసంప్రదాయములయందు రక్తిగలదై వెలసెను. ఈవిదుషీ మణికిఁ జక్కని సంస్కృతకవితయుఁ జేకూరినది. ఈమె తన కైతవలన నాంధ్రస్త్రీ లోకమునకును, భారత రమణులకు నాయకమణియై వన్నెగాంచు నను నాశకుఁ దావు చేకూరు సమయమున విషజ్వర పీడితయై స్వర్గస్థురా లగుటవలనను దేశమునకు వాటిల్లిన విపత్తునకు వగచుచు వృద్ధురాలైన వారితల్లి గారికిని సానుభూతిని దెలుపవలసి యున్నదనియును దీర్మానము నుపపాదించిరి.

అటుపై మహారాజశ్రీ చోడవరపు దేవళరాజు పంతులుగారు చయనులు గారికిని దమకునుగల చిరకాల పరిచయమును వారి ప్రతిభావిశేషమును గూర్చియు ముచ్చటించిరి. అటుతరువాత మహాలక్ష్మీ సుందరమ్మగారు పీఠము గోష్ఠుల యందు జరిపిన ప్రసంగములను దాము స్వయముగ విని యున్నామనియు, వీరిరువురియొక్క కుటుంబములకు సానుభూతిని దెలుపుట ముఖ్యకర్తవ్యమని తీర్మానమును బలపరచిరి.

అటుపై శ్రీయుత దాసు త్రివిక్రమరావుగారు ప్రసంగించుచు శ్రీచయనులుగారు కేవలశాస్త్రపాండిత్యమునందే గాక

రాజకీయ రంగము నందును అసమానమైన ప్రజ్ఞావిశేష ముతోఁ జేసియుండిన యుపన్యాసములను దాము వినియున్నా మనియుఁ, దా మొక్కపరి, జ్ఞానవాసిష్ఠమును వారివలన విని చిత్తశాంతిని పొందఁగల్గితి మనియుఁ జెప్పిరి. మహాలక్ష్మీసుంద రమ్మగారు అమృతసందేశ పత్రికకు ఆంగ్ల భాషలో రచించిన వ్యాసములను దాము చూచి యాంధ్రదేశమున నిట్టి విదుషీ మణులు వెలసిరికదా యని గర్వించితి మని చెప్పిరి. ఇట్టివారు గతించిన వెలితి తీరి మన ఆర్యవిద్యలు పునరుద్ధరింప బడవల యునని పీఠమువారు చేయు కృషిహర్షింపఁ దగినదనియుఁ జెప్పిరి. శ్రీయుత చుండూరి వెంకటరెడ్డిగారు శ్రీచయనులగారియొక్కయు సుందరమ్మ గారియొక్కయు గుణగణములను గూర్చి ప్రసం గించుచు, మహాభారతరంగమున భీష్మాభిమన్యులవలె, నొక వారములోనే పడిపోవుట దేశమునకు తీరనివెలితి. తిరిగి అట్టి విద్వాంసులు, విదుషీమణులు ఆంధ్రదేశమునఁ గొఱత లేకుండ వెలయుదురుగాక యని దైవమును ప్రార్థింత మనిరి.

సభవారు సానుభూతిని వారివారి కుటుంబములకు తెలుప వలసినదిగా ఏకగ్రీవముగాఁ దీర్మానించిరి.

శ్రీమతి కనకాంబగారు, సుందరమ్మగారిని గూర్చి రచించిన పద్యములు సభలోఁ జదువఁబడినవి.

వందనములతో సభ ముగిసెను.

## శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు, రాజమండ్రి.

మహాలక్ష్మిసుందరిని నేను పుట్టుకనుండియు నెరుగుదును. ఆమె యనిన నా కమితమగు ముద్దు, ప్రేమ. తనకు చిరకాలమునకు జనించిన యొక్కతెయే బిడ్డకదా యని యామెను అర్థములేని గారాబము చేయక చక్కని క్రమశిక్షలో పెంచి యిట్టి విద్యావిశారదగా, అపర సరస్వతిగా తయారు చేసిన శేషమ్మగారనిన నా కమిత గౌరవము. నిజముగా నామె యాదర్శక భార్య, సంఘసేవా పరాయణయే గాదు, ఆదర్శ మాత. ఆమెకు తనవారు, పెఱవారు అను భేదము లేదు. అందఱను సమానదృష్టితో చూచు ప్రేమస్వరూపిణి. ఆమె బిడ్డను చూచి పై వార మందఱము గర్వపడెడువారము. కాని యామె కిసుమంతయు గర్వ ముండెడిది కాదు. తన బిడ్డ యొక్క బుద్ధివైభవములను ఎవరి యొద్దను ప్రశంసించెడిది కాదు. ఇతరులు ప్రశంసించుచుండ నమ్రత జూపెడిది.

మహాలక్ష్మిసుందరి తల్లియొక్క కీర్తిని చిరస్థాయి చేస్తుందనుకొన్నాము. ఆమెచే నడుపఁబడుచున్న హిందూసుందరి పత్రిక, విద్యాలయము, స్త్రీ సమాజము మొదలగు వానిని వేయిరెట్లు సమర్థతతో నడపి లోకమున కాదర్శప్రాయ యగు ననుకొన్నాము. ఆంధ్రదేశ స్త్రీలకు వన్నె దెచ్చుచు నాంధ్రలోకములో నొక వెలుగు వెలుగు ననుకొన్నాము. ఉన్నత విద్యావంతురాండ్రగు స్త్రీ లెట్లుండ వలయునో మార్గము చూపు ననుకొన్నాము. మా యాశ లన్నియు నొక త్రుటిలో భగ్నమై పోయినవి. ఆమె సూచనలను మాత్రమే చూపి వెడలిపోయినది. ఈ దుఃఖము వృద్ధురాలగు తల్లి

యొక్కర్తృక భరించి జీవించుట కష్టమని యాంధ్రలోక మంతయు పంచుకొన్నది. ఇంతకు ఇది ఆంధ్ర దేశముయొక్క దౌర్భాగ్యము. బాల్యము నుండియు వేదాంతములోనే పెరిగిన తన బిడ్డయే శేషమ్మగారికి వేదాంతోపదేశము చేసి యుండును. ఆమెకు వేరొకరు చెప్పవలసిన యగత్యము లేదు. శ్రీ శేషమ్మగారికి సమాన దుఃఖభాగురాల నగు నా యొక్క హృదయపూర్వక సానుభూతి.

---

## కీ. శే. కా. మ. సుందరమ్మ, ఎం. ఏ., యల్. టి., గారి చెన్నపురి మేరీరాణీ కళాశాలలో సానుభూతిసభ

### శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి, ఎం. ఏ., బి. యల్ గారి యుపన్యాసము

మహాలక్ష్మి సుందరమ్మకు ఐదేండ్లు వచ్చునప్పటికే తల్లి సంస్కృతపాఠశాల స్థాపించినది. ఆ పాఠశాలలోనే సుందరమ్మ విద్యాభ్యాస మొనరించెను. ఆ కాలమందు కాళిదాస భవభూతి విరచితములగు శాకుంతల, ఉత్తర రామచరితము మొదలగు నాటకములలో శకుంతల సీత మొదలగు పాత్రల ధరించుచు వానిని కడునేర్పుతో నటించుచుండెడిది. రంగస్థలము లందు నిలువబడి తన నటనాకౌశలము సంస్కృతవాగ్ధాటి చూపుచున్న యా బాలికం జూచి ప్రేక్షకు లామె బాలసరస్వతియని యాశ్చర్యపడుచుండెడివారు. మా కాకినాడలో నింత చక్కదనము నింత చదువు కల బాలిక లేదనుకొనుచుండువారము. అటుపిమ్మట కాశీ విశ్వవిద్యాలయమందు చెన్నపురి విశ్వవిద్యాలయమున రాజధానికళాశాలయం దామె యున్నత విద్య నభ్యసించి, సంస్కృతభాషయం దానర్సు పరీక్షలోను,

పిమ్మట నాంధ్రభాషలో ఎం. ఏ., పరీక్షలోను కృతార్థురాలైన దనుట జగద్విదితము. రాజధాని కళాశాలలో జరుపఁబడిన సంస్కృత వ్యాస పోటీపరీక్షయందు ప్రథమ బహుమాన మామెకే యొసగఁబడెను.

మహాలక్ష్మీసుందరమ్మగారు తల్లిదండ్రుల కల్లారు ముద్దుబిడ్డగా భర్తకు ప్రేమగల పతివ్రతాశిరోమణిగా, పెద్ద లకు ప్రమాణబుద్ధిగల యాస్తికశిరోమణిగా విద్యార్థినుల కుత్తమబోధకురాలుగా, పూర్వాపర ధర్మస్వరూప మెరిగి, సభా ముఖమున ప్రబోధము కావింపఁగల మహాప్రవక్త్రగా నన్నిట పూర్ణతఁ జూపి ఇదిసుమా మార్గమని ఆదర్శగృహిణిగా నుండి యిరువదియైదుసంవత్సరములకే పరమపదమున కేగినది. ఇన్ని సులక్షణములు ఇంత సమగ్రమైన విద్యాసంపత్తియొక్క చోట దొఱకుట దుర్లభము.

ఇంత విద్యావతి నని యామె యే మాత్రము గర్వ పడలేదు. ఆర్యాచారములను బూర్వపద్ధతులను వదల లేదు. ఆమె కామెయే సాటి. ఆమె యందుఁ బూర్వాచార పరా యణత్వము కానిపించినను సుందరమ్మగారు ఆశయముల యందు చాల ముందంజవేసి యవి సాగించుటకు ప్రయత్నించి నది. 'విద్య యొసగును వినయం'బను పెద్దలు చెప్పిన దామె యందు నిజమైనది. అట్టి యామెను గోలుపోవుట భారతదేశ స్త్రీల దౌర్భాగ్యము. స్త్రీలలో దేశభాషావ్యాపకమున నామె ఆశయములు గొన్నింటినైన మనము నెరవేర్చి భారత విజ్ఞానము స్త్రీలలో వ్యాపకముచేసి ధన్యులుకావలెనని చెప్పిరి.

# శ్రీ మహాలక్ష్మి సుందరాంబాస్మృతి పద్యరత్నములు

( కవిరత్న శ్రీ దోమా వేంకటస్వామి గుప్తగారు)

శా॥ శ్రీక్ష్మానీళల నేలు దైవతము వర్ధిష్ణు ప్రభావప్రభా
సూక్ష్మస్థూల విరాజమానము కృపాశోభాయమానత్వ భా
గ్లక్ష్యంబై తగు వేంకటేశ్వర పరబ్రహ్మంబొసంగున్ మహా
లక్ష్మీసుందరమాంబికాత్మకు నలోలంబైన శాంతత్వమున్.

ఉ॥ మంచికులంబునన్ బొడమి, మంచితనంబులకెల్ల నెల్లయం
దంచితమైన పేరు కడు నాటలపాటలనాడె గాంచి రా
ణించి వయోధికన్ మతిగడించి త్రిలింగ సురాంగ్లభాషలన్
మించిన శ్రీమతిన్ దొఱసి మేకొను సెట్లల సుందరాంబికన్.

సీ॥ జననంబు చెందుటా యనఘానఘం బంచు
నలువుగాంచిన బ్రాహ్మణకులమందు?
రూపం బటందమా ప్రాపుగా బంగారు
బొమ్మ నీకును సాటిఁ బోలగలదె?
ప్రాయంబఁటన్న నీ ప్రాయంబువారి కో
నామాలకుం బది యామడలగు
నేర్చిన విద్యయా? నిరుపమ త్రైలింగ్య
మమరాంగభాష లననంగరిమ

## శ్రీ మహాలక్ష్మీసుందరాంబాస్మృతి

తే॥ గీ॥ మగనితోఁ గాఁపురమునకు దిగియు దిగక
మునుపె యకట మూఁడేండ్లు నీ కౌనరె నోళ్ళ?
పాపికలియుగంబున నుండఁ బట్టలేదు?
శోభితమతీ! మహాలక్ష్మి సుందరాంబ!!

శా॥ చీకుం జింతయు లేక చిన్నయపుడే శ్రీవేంకటాద్రీశ్వర
శ్రీకృత్సన్నిధిఁ జేరువారుగద నీచెల్వైన వారల్ కరం
బో కల్యాణి! మముంబలెం దనరు పాపోపేతులీ యుర్విలో
గాకుంగాంతురుఁ బెద్దకాలమును వీఁకన్ సుందరాంబామణీ!!

శా॥ నీవాత్మన్ సుఖియించుచుంటి వల శ్రీనీరేజపత్రాక్షు శో
భావిన్యాససదంతికంబున; నినున్ భావంబునన్ గాక ప
ద్మావేశాకృతి నెంచికోలు తగునా యంచింత యోచింపుచున్
భావంబందున నిన్ను నెంతు శుభభావా! సుందరాంబామణీ!

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠమువారి

సా హి త్య శా ఖ

# క వి తి ల క గ్రం థ మా ల

శ్రీ పీఠస్థాపనాచార్యులగు నమృతానందనాథస్వామివారి బోధములు

శ్రీమతి కవితిలక, కవితావిశారద

## కాం చ న ప ల్లి  క న కాం బ గా రి చే

## నాం ధ్ర ప్ర బం ధ రూ ప ము న  ర చిం ప బ డి న వి

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ జీవయాత్ర | ... | 2– 8–0 |
| 2. | అమృత సారము | ... | 1– 0–0 |
| 3. | ఆనందసారము | ... | 1– 4–0 |
| 4. | హంసవిజయము (అద్వైతప్రతిపాదక మహానాటకము. సర్వ సమన్వయ సమగ్రము) | ... | 1– 8–0 |
| 5. | శ్రీ తోమాలియ (అపూర్వ మనోహరమగు ప్రాస్తావిక పద్యప్రబంధము) | ... | 1– 4–0 |

## క వి తి ల కా ను వా ద ము

| | | | |
|---|---|---|---|
| 6. | అభిజ్ఞాన శాకుంతలము (నాటక లక్షణాలతోఁ గూడిన యుపోద్ఘాత మున్నది) | ... | 1– 4–0 |
| 7. | కందరామాయణ సంగ్రహము | | 1– 4–0 |
| 8. | రాధ—వచనము (ఇదియొక కథ. ద్రావిడభాషనుండి ఛాయానువాదము. ఆధునిక ద్రావిడదేశ పరిస్థితులను దెలియపఱచును.) | ... | 0–15–0 |
| 9. | గౌతమ చరిత్ర (వచనము) | | 0–10–0 |

## పండితరాజ, దంటు సుబ్బావధాని విరచితములు.

10. ఆంధ్ర భామినీ విలాసము ... 1– 0–0

(శ్రీ జగన్నాథ పండితరాయల యన్యోక్తుల కాంధ్రానువాదము, లలితము, మనోహరము)

11. కవికంఠోక్తి ... 0 –4–0

(కవిత్వము, భావభరితము. ధీరకవిత శిక్షాలమున నిది పరమలక్ష్యము)

12. అమృత సందేశము ... 0 –8–0

(సంస్కృతగ్రంథము, ఆంధ్ర టిప్పణిసహితము, కర్తవ్య ప్రబోధకము, తెనుగువంటి సంస్కృత కవితామాధుర్య మిందున్నది)

13. చిత్రమాధవ నాటకము ... 1– 0–0

14. ధర్మధ్వజము ... 0– 8–0

(ఇందు వ్యాకరణకేసరి, ధర్మస్థాపక, పుల్య ఉమా మహేశ్వర కవిరత్నకృతము లగు స్వధర్మబోధకము లగు శ్లోకము లున్నవి. నవపండితరాయని కవితా వీరావేశము నిందుఁ బ్రకటితము)

15. తులసీదాస చరిత్రము ... 1– 4–0

(ఇది మహాభక్తుని చరిత్రము. ఆంధ్ర పద్య ప్రబంధము. ధర్మవాది: దంటు శ్రీనివాసశర్మ గారిచే రచింపబడినది)

16. ప్రబోధసుధాకరము ... 0– 8–0

(శ్రీ శంకర భగవత్పాదాచార్యులవారి సంస్కృతమున కాంధ్ర వచనానువాదము. కీ. శే. కాళ్ళకూరి మహాలక్ష్మి సుందరమ్మగారిచే రచింపఁబడినది. ఇందు సగుణ నిర్గుణ భక్తి సమన్వయము ప్రతిపాదింపఁబడినది. ఇది యెల్లరుఁ జదివి యానందింపఁదగినది).

లేదు. అందువలన వనకుఁ గనఁబడు ఈ స్థూలదేహము, ఈ యింద్రియములు కర్తృభోక్తృరూపమైన చేతనాత్మ కాదని నిర్ణయింపఁబడెను. పోనిమ్ము ఉచ్ఛ్వాసనిశ్వాసములను కల్గించి శరీరము జీవించియున్నదని చెప్పుటకుఁ గారణమైన ప్రాణమే తెలిసికొను ఆత్మయని చెప్పఁగూడదా యన్నచో నదియును గుదురదు. ఎందువలన ననగా మనుష్యుఁడు నిద్రించిన సమయమందుకూడ ప్రాణము తానుండి తనపనిని, చేయుచునేయున్నది. ఒకదొంగ యింటిలో ప్రవేశించి వస్తువుల దోఁచుకొని నష్టము కల్గించునపుడు శరీరమందున్న ప్రాణము దానిని దెలిసికొనుట లేదు. అందువలనఁ బ్రాణముగూడ తెలిసికొనునాత్మ కాదని నిర్ణయమైనది.

అవ ॥ మనస్సుకూడ ఆత్మ కాదని చూపుచున్నారు.

**మనసో యది వా విషయ స్తద్యుగప త్కిం న జనాతి ।**
**తస్య పరాధీనత్వా ద్యతః ప్రమాదస్య క స్త్రాతా ॥ 92**

ప్ర : వా = అట్లుగాక, (ఆతెలిసికొనుట) మనసః = మనసుయొక్క, విషయాః పని, (అనఁగా నాతెలిసికొనుఆత్మ మనస్సు) అన్నచో, తద్ = ఆమనస్సు, యుగపత్ = (తనముందున్న శబ్దాదివిషయపదార్థము లన్నిటిని) ఒకేసారి, కిం, న, జానాతి = తెలిసికొన లేకున్నదేమి? తస్య = ఆమనస్సు యొక్క, పరాధీనత్వాత్ = స్వాతంత్ర్యములేక మఱియొకదాని మీఁదనాధారపడి దానిచెప్పుచేఁతలందే యుండుటవలన అది సరిగాఁ దెలిసికొనమికి అనఁగా భ్రమప్రమాదములకు వశమగుచుండుటవలనయతః = అందువలన, ఆమనస్సు తెలిసికొను ఆత్మపదార్థము కాదు. ప్రమాదస్య = ఈపొరపడు మనస్సుయొక్క త్రాతా = పరిపాలించి రక్షించువాఁడు, కః ఎవఁడు? అతఁడే యాత్మ కావలెను.

తా : పోనిమ్ము ఈ తెలిసికొను ఆత్మ మనస్సే యనఁగూడదా? అన్నచో, మనస్సున కెదురుగా శబ్దాదిసర్వవస్తువు లున్నందువలన వాని నన్నిఁటిని (ఒకదానితరువాత మఱొకదానిని గాక,) ఒకేసారి వానినన్నింటిని తెలిసికొనవలెను. కాని మన స్సట్లు తెలిసికొనుట మనస్సునకు స్వాభావికము గాదు. అనఁగా తెలిసికొను మూలపదార్థము మనస్సు గాదని, యది మఱొకదానిపని యని ఆమనస్సు ఆమూలపదార్థమున కధీనమై యున్నదని చెప్పవలెను. అప్పుడు మాత్ర మాయాత్మ యన్నిఁటిని ఒకేసారి యెందుకు దెలిసికొనుట లే దన్నచో, దానికి సాధనము మన స్సనియు, మనస్సున కట్టిశక్తి లేనందువలన, మనస్సుద్వారమున నెంతవఱకుఁ దెలిసికొనఁ గలదో యంతవఱకు దెలిసికొనుచున్న దని సమాధానము చెప్పవచ్చును. దీనివలన తెలిసికొనుటలో మనస్సు స్వతంత్రముగలది కాదనియు నది మఱి యొకరిపై నాధారపడి యున్న దనియు ధ్రువమైనది. మఱియు మనస్సు భ్రమప్రమాదములకు వశ మగుచున్నది. మఱల చూడుమని, సరిగా గ్రహింపుమని దానిని భ్రమప్రమాదముల నుండి తప్పించువాఁడు మఱొకఁ డుండవలెను. అతఁడే ముఖ్యాత్మ. అతనిశక్తివలననే మనస్సు పనిచేయుచున్న దన వలెను. ఈవిధముగా శరీరము, ఇంద్రియములు, ప్రాణము, మనస్సు ఇవేవియు స్వాభావికముగా తెలిసికొనునాత్మ కాదని నిరూపితము. అంతర్యామియై చిత్స్వరూపమైన ఆత్మ తన సాన్నిధ్యమువలన వీనినన్నిటిని నడిపించుచున్నది. ఇట్టి యిట్టిలక్షణములుగల ఆత్మపదార్థము ఉన్నదని నిశ్చయముగా న్యాయసమ్మతముగా సిద్ధించినది. కావుననే దీనిని ఆత్మసిద్ధిప్రకరణమన్నారు.

అవ॥ ఈయర్థము నొకచక్కని యుదాహరణముతో విశదీకరించు చున్నారు. రెండుశ్లోకములలో.

గాఢధ్వాన్త గృహాన్తతః క్షితితలే దీపం నిధా యోజ్జ్వలం।
పఞ్చచ్ఛిద్రముఖం హి కలశం తస్యోపరి స్థాపయేత్ ।
తద్బాహ్యే పరితో ఽనురన్ధ్ర మమలాం వీణాంచ
కస్తూరి కాం।
సద్రత్నం వ్యజనం న్యసే చ్చ కలశచ్ఛిద్రాధ్వనిర్గచ్ఛతా॥
93

తేజోంశేన పృథక్పదార్ధనివహజ్ఞానం హి యజ్జాయతే 94
త ద్దస్త్రైః కలశేన వా కిము మృదో భాణ్డేన తైలేన వా।
కిం సూత్రేణ స చైత దస్తి రుచిరం ప్రత్యక్షబాధా దతో
దీపజ్యోతి రిహైక మేవ శరణం దేహేత థాఽఽత్మస్థితః॥

ప్ర : గాఢధ్వాన్త గృహాన్తతః గాఢః దట్టమైన, ధ్వాన్త = చీకటిగల, గృహాన్తతః = ఇంటిలోపల, క్షితితలే = నేలమీఁద (మట్టిప్రమిదలో మంచివత్తిచమురు పోసి వెలిగించినపిమ్మట) ఉజ్జ్వలం = మిక్కిలిగా ప్రకాశించు, దీపం = దీపమును, నిధాయ = ఉంచి, తస్య = ఆబాగుగా వెలుగుచున్నదీపముయొక్క ఉపరి = పైభాగమందు, పఞ్చచ్ఛిద్రం = ఐదురంధ్రములు కలదియు, అధోముఖంహి = మూతి క్రిందుగాఁ గలదియు బోర్లింపఁబడినదియు నగునట్లే, కలశం = కుండను స్థాపయేత్ = ఉంపవలెను. (మఱియు,) తద్బాహ్యే = ఆకుండకు వెలుపల, పరితః = అన్నివైపుల, అనురన్ధ్రం = ఆయైదురంధ్రముల కెదురుగా, అమలాం = ఉసిరికకాయను, వీణాం = (మ్రోగు) వీణను, కస్తూరికాం = పరిమళించుచున్న కస్తూరిని. సద్రత్నంచ = మెఱయుచున్నటువంటి మంచి రత్నమును, వ్యజనం = (గాలికల్గించు) వీవననుకూడ న్యసేత్ = ఉంచవలెను. (అప్పుడు) కలశచ్ఛ

ద్రాధ్వనిర్గచ్ఛతా కలశ = ఆకుండయొక్క ఛిద్ర = రంధ్రములయొక్క, అధ్వ = మార్గములగుండ, నిర్గచ్ఛతా = బయలువెడలుచున్నదైన, తేజోఽంశేన = కాంతికిరణభాగముచేత, పృథక్పదార్థనివహజ్ఞానం పృథక్ = వేఱుగా వేఱుగానున్న పదార్థ = నేలఉసిరికకాయ, వీణ, కస్తూరి, రత్నము, విసనకఱ్ఱల యొక్క నివహ = సమూహముయొక్క, యత్‌జ్ఞానం = వానిస్వభావము లను రుచి, (శబ్ధ), ధ్వని, వాసన, రూపము, స్పర్శములనుగుణములచేత (తెలిసికొనుట) ఏతెలివి జాయతే = పుట్టుచున్నదో, తద్ = ఆవస్తుజ్ఞానము హి = ఏకారణమువలన కలుగుచున్నది? కలశేన = ఆకుండవలననా? రంధ్రైః = అకుండయొక్క రంధ్రములవలననా? (జాయతే = పుట్టుచున్నది?) వా = లేక, మృదః భాణ్డేన = మట్టితోఁజేయఁబడినప్రమిద (పాత్ర,) వల ననా? కిము = లేక తైలేన (జాయతే) = దీపమును వెలిఁగించునూనెవల నఁ బుట్టినదా?, వా = లేక, కిం సూత్రేణ = (దీపపు) వత్తివలన (పుట్టి నదా?), ప్రత్యక్షబాధాత్ = ఇంద్రియజ్ఞానానుభవమునకు సరిపోక పోవుట వలన, ఏతద్ = పైపేర్కొన్నజ్ఞాన కల్పకారణముదెలియు, రుచిరం = సరి యైన కారణముగా, న అస్తి = లేదు. అతః = ఇందుచేత, ఇహ = ఇక్కడ విచారించినఈజ్ఞానోత్పత్తికి ముఖ్యకారణము (సరియైన సమాధానము)గా, దీప జ్యోతిః = దీపముయొక్క వెలుగు ఏకం ఏవ = ఒక్కటిమాత్రమే శర ణమ్ = (మనకు సరియైన యుత్తరముగా) రక్షించునది. తథా = ఆయుజ్జ్వల దీపజ్యోతివిధముగా దేహే = శరీరమునందు, ఆత్మా = పంచేంద్రియజ్ఞానద్వారములు గల జ్ఞానాత్మ, అస్తి = ఉన్నాఁడు.

**తా :** పైశ్లోకార్థమును ఒకచక్కని యుపమానముతో స్పష్టపఱచుచున్నారు కటికచీఁకటి యావరించిన యొకయింటిలో **నేలమీఁద మట్టిప్రమిదలో** నున్నచమురువత్తితో **మిక్కిలిప్రకా శవంతముగా** వెలుఁగు నొకదీపము నుంచుము. దానిపై నైదు రంధ్రములుగల యొకకుండను మూతి నేలపై నుండునట్లు బోరగిల నుంచుము. దానికి వెలుపల రంధ్రముల కెదురుగా నొకదాని దగ్గఱ ఒకఉసిరికకాయను, మఱొకరంధ్రమునెదుట మ్రోగుచున్న వీణను, మూఁడవదానియెదుట పరిమళించుచున్న కస్తూరిని, నాల్గవ

దానియెదుట బాగుగా మెఱయుచున్న యొకమంచిమణిని, మిగిలిన రంధ్రమునద్ద గాలివీచువిసనకఱ్ఱను ఉంచుము. ఇప్పు డారంధ్రములనుండి వచ్చు కాంతివలన నాయెదువస్తువులజ్ఞానము గదిలో నున్న మనకుఁగల్గుచున్నది? అది ఆకలశములవలననా? లేక కలశముయొక్క రంధ్రములవలననా? లేక యాకుండవలననా? లేక దీపమును వెలిఁగించు నూనెవలననా? లేక దీపపువత్తివలననా? నిజముగాఁ జూచినచో వీనిలో దేనివలనఁ గూడ నావస్తువులజ్ఞానము మనకుఁ గల్గుట లేదని స్పష్టమగుచున్నది. ఆదీపమును దీసివేసినచో ప్రత్యేకముగా నివన్ని యున్నను వానిజ్ఞానము మనకు ఏమాత్రమును గల్గదు. కావున నీజ్ఞానము కల్గించున దొక్క దీపమే, మఱొకటి కాదని సిద్ధించుచున్నది. అదేవిధముగా జ్ఞానేంద్రియరంధ్రములుగల యీశరీరమందున్న చిద్రూపాత్మయే యీ సర్వవస్తువులజ్ఞానమునకు ముఖ్యకారణ మని నిశ్చయింపవలెను. ప్రాపంచికవిషయసేవాభరిత జ్ఞానశూన్యాలకజీవితమే, కాఱుచీకట్లతో నిండినయిల్లు. ఇందు పంచరంధ్రములుగల కలశమే యీస్థూలశరీరము. ఐదురంధ్రములు నైదుజ్ఞానేంద్రియములగు చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు. వానికెదురుగా నుంచిన వస్తువులు వానిచేతఁ దెలియఁబడు శబ్దాదివిషయములు. రుచిచేత నుసిరికకాయ, ధ్వనిచేత వీణ, వాసనచేత కస్తూరి, రూపముచేత (మణి) రత్నము, వీచుగాలి శరీరమునకుఁ (తగులుట) స్పర్శము వలన వీవన, వీనిజ్ఞానము మనకుఁ గల్గును. దీపముగల మట్టి ప్రమిద, ప్రాణిభౌతికావయవసమూహము. ఇందలి దీపపువత్తి మనస్సు. దీపమును పోషించు తైలము ప్రాణము. ఇవేవియును ఒక్కొక్కటిగాని, కొన్నిగాని, యన్నిగాని, వస్తువిజ్ఞానమును, ఇవిగాని మఱొక్కటిలేనిది, గల్గింపజాలవు కావున నివేవియు తెలియు ముఖ్యాత్మ కావు. దేనియునికిమాత్రమున వీనియన్నింటియుని

కివి గలుగఁజేసినట్లు హానివాని పనుఃయందు ప్రేరకమాత్రమో యన్నట్లున్న చిద్రూపపదార్థమే ముఖ్యాత్మ. ఇది సర్వాధిష్ఠానము. అది పైఁజెప్పిన వేవియునుగానిది, నిర్విశేషమైనదియు ఈపంచవిధవస్తుజ్ఞానము కల్గుటకు మూలాధారమైన పదార్థముగా ఆత్మయే సిద్ధించుచున్నది. కావున, ఇది ఆత్మసిద్ధిప్రకరణమైనది.

## గురుశిష్య ప్రశ్నోత్తరరూపము

ఇచ్చట శ్రీశంకరభగవత్పాదులవారు గురుశిష్యప్రశ్నోత్తరరూపమున ప్రబోధించిన ప్రసిద్ధమైన యేకశ్లోకశ్యర్థము స్మరణీయము.

శ్లో॥ కిం జ్యోతి స్తవ భానుమా నహని మే రాత్రౌ ప్రదీపాదికం,
స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే।
చక్షు స్తస్య నిమీలనాదివిషయే కిం, ధీ, ర్ధియో దర్శనే
కిం తత్రాహం మతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మి
ప్రభో ॥

గురువు ప్రశ్న : కిం జ్యోతి స్తవ? విషయములను దెలియఁజేయు వెలుఁగు లేక చైతన్యము నీకేది?

శిష్య సమాధానము : మే అహని భానుమాన్ రాత్రౌ ప్రదీపాదికమ్। నాకుఁ బగటియందు సూర్యుఁడును, రాత్రియందు, పెద్దదీపము నక్షత్రములు, చంద్రుఁడు మొదలైనవి జ్యోతిస్సులు.

ప్ర : స్యా దేవం రవిదీపదర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే? అట్లే కావచ్చును. కాని ఆసూర్యదీపాదులను జూచుక్రియయందు జ్యోతి ఏదియో నాకుఁ జెప్పుము.

స : మే చక్షుః। ఆసూర్యచంద్రాదులఁ జూచుక్రియయందు

నాకన్ను అను ఇంద్రియమే జ్యోతిస్సు.

ప్ర : తస్య నిమీలనాదివిషయే కిం ? ఆకంటిని మూసికొని యున్నను, ఈకన్ను పనిచేయని కలయందును నీకు జ్యోతి స్సేది?

శి : ధీః ఆసమయములందు నానిశ్చయాత్మకబుద్ధియే నా జ్యోతిస్సు.

ప్ర : ధియోదర్శనే కిం? ఆబుద్ధినిగూడ దెలిసికొనుజ్యోతి స్సేది?

స : తత్రాహం=ఆబుద్ధినిజూచు విషయమందు నేనే జ్యోతిస్సును అనగా నేను సర్వజ్ఞచైతన్యముచు.

గురువు : అతో భవాన్ పరమకం జ్యోతిః। ఈకారణమువలన నీవు సూర్యాదులకన్నింటికంటె నెక్కువైన పరమజ్యోతివి, పరమాత్మవు.

శిష్య : తదస్మి ప్రభో- ఓగురుదేవా! ఆపరమజ్యోతిస్స్వరూపుఁడు గనే నే నున్నాను. ఆసర్వాతీతసర్వాధిష్ఠానసాక్షి చైతన్య స్వరూపుఁడగు ఆత్మను నేనే అని తాత్పర్యార్థము. ఇట్లాత్మపదార్థము చైతన్యజ్యోతిగా సునిశ్చితము,

"జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే" ఇతి గీ 13-17 లోకములోఁ దెలియఁబడుచున్న సూర్యచంద్రనక్షత్రాదిజ్యోతుల కన్నింటికి జ్యోతి యైనది అజ్ఞానగమ్యమైనది కేవలాత్మ. ఆ యాత్మజ్యోతి అజ్ఞానాంధకారమునకంటె భిన్న మైనది.

"అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః" గీ 10-20

ఓజితనిద్ర! అర్జున! నేను సర్వప్రాణులయొక్క హృదయమందున్న ప్రత్యగాత్మ (స్వరూపుఁడ)ను.

ఈమొదలైన గీతాప్రమాణవాక్యములచేతను ఆత్మపదార్థము నిత్యసిద్ధ మని సునిశ్చితము.

ఆత్మవిషయబోధకు ఉపనిషత్తులు ప్రమాణశాస్త్రము. అందు "ఆత్మా వా ఇదం ఏక ఏవ అగ్ర ఆసీత్" ఐతరేయోపనిషది 1-1-1 "ఈనామరూపకర్మభేదములచే ననేకముగా కనఁబడుచున్న ఈజగత్తు దీని సృష్టికిఁ బూర్వమందు ఒకటైన యాత్మగనే యుండెను. "సదేవ సోమ్యేద మగ్రఆసీ దేక మే వాద్వితీయమ్" ఛాందోగ్యోపనిషది 6-2-1, "ఓసోమ్య! బుద్ధిచేత నామరూపక్రియావంతమై వికృతముగా ఉపలభ్యమాన మగుచున్న యీ జగత్తు దీనియుత్పత్తికిఁ బూర్వమందు ఉనికియే స్వరూపముగాఁ గల సత్పదార్థముగనే ద్వితీయవస్తురహితమై ఏకముగనే యుండెను. ఆసత్పదార్థము సూక్ష్మమును, నిరతిశయమును, భేదరహితమును, సర్వగతమును, ఏకమును, నిరంజనమును, నిరవయవమును, విజ్ఞానము నైన దని సర్వవేదాంతములవలన తెలియఁబడుచున్నది.

ఇట్లు ఆత్మసిద్ధి శ్రుతిస్మృతిన్యాయసిద్ధ మైనది.

## 8. మాయాసిద్ధి ప్రకరణమ్ (మాయాసిద్ధిప్రకరణము)

అవ॥ త్రిగుణాత్మకమాయాశక్తియే సర్వవ్యావహారికజగత్తుగాఁ బరిణమించుటను నిరూపించుప్రకరణ మగుటచే ఇది మాయాసిద్ధిప్రకరణ మైనది.

ఈకనఁబడుచున్న జగద్వస్తుజాలమం దేదియునుగాక, వీనినన్నింటిని బ్రకాశింపఁజేయుచున్న స్వయంప్రకాశమానమైన సద్వస్తువుగా సిద్ధించినది కేవలాత్మ. మఱి యీదృశ్యమానజగత్స్వరూపస్వభావము లెట్టివో విశదీకరించుచున్నారు. "జన్మాద్యస్య యతః"– బ్ర.సూ. 1-1-2. ఈదృశ్యమానప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు దేనివలననో యది బ్రహ్మము". "యతో వా

ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ. తై 3-1-1. అనగా సర్వజీవులయొక్కయు సర్వప్రపంచముయొక్కయు సృష్టిస్థితిలయములు ఏపదార్థమువలన గల్గుచున్నవో అది బ్రహ్మము. బ్రహ్మతటస్థలక్షణము. "తటస్థలక్షణం నామ యావల్లక్ష్యకాల మనవస్థితత్వే సతి తద్వ్యావర్తకమ్ తదేవ (వేదాంతపరిభాష 7-3). తెలియబడ వలసిన లక్ష్యపదార్థమగు కేవలాత్మ యున్న సర్వకాలములందును తాను లేకున్నను, ఆలక్ష్యమును తక్కినవానినుండి వేఱుచేసి చూపునదే తటస్థలక్షణము. అది లక్ష్యమగు బ్రహ్మస్వరూపమును వాచ్యముగా సాక్షాత్తుగాఁ జెప్పకున్నను తక్కినవాని నుండి బ్రహ్మమును వేఱుచేసి అవిగాక మిగిలి ప్రకాశించుచున్న వస్తువని తెలుపునది. (చూపునది) సృష్టిస్థితిలయములు త్రికాలాబాధితముగా నిజముగా లేవు. కాని అజ్ఞులగు సంసారులచే అనుభవింపఁబడుచున్నవి. వీని కాధార మైనది, బ్రహ్మము. మాయాశక్తివలన సృష్టిస్థితిలయాది వ్యావహారికజగత్తు సిద్ధించి యున్నవి, ఆమాయాశక్తిని గుఱించి వివరముగాఁ జెప్పఁబోవుచున్నారు.

**చిన్మాత్రః పరమాత్మా హ్యపశ్య దాత్మాన మాత్మతయా।**
**అభవ త్సో௽ హన్నామా తస్మా దాసీ ద్భిదో మూలమ్॥**

**95**

ప్ర: చిన్మాత్రః = కర్మకాండవిహితజ్ఞాననిశ్చయ ఫలరూపియు, పరమాత్మా = సర్వోత్కృష్టమైన శ్రౌతకర్మఫలశరీరము కలవాఁడగు హిరణ్యగర్భుఁడు, ఆత్మానం = తనస్వరూపమును, ఆత్మతయా = తనపూర్వజన్మవిజ్ఞాన సంస్కృతునిగా, అపశ్యత్ = చూచుకొనెను. సః = ఆతఁడు, అహం = "నేను" అనునదే పేరుగాఁ గలవాఁడాయెను, తస్మాత్ = దానివలన, భిదః = భేదమునకు (వైవిధ్యమునకు) మూలమ్ = ఆధారము, కారణము, ఆసీత్ = కల్గెను.

తా॥ శ్రుతికర్మకాండవిహిత సర్వజ్ఞాననిశ్చయసంపన్నుఁడై ఆవైదికజ్ఞానకర్మఫలకార్యభూతుఁడును పరమశ్రేష్ఠములైన శిరఃప్రాణాదిలక్షణశరీరియు, అండజన్ముఁడై ప్రథముఁడునగు

హిరణ్యగర్భుఁ డను పేరుగల ప్రజాపతి, తనను గూర్చి, పూర్వ జన్మశ్రౌతవిజ్ఞానసంస్కృతునిగా, ప్రథమసంభూతునిగా జూచెను. (ఎతింగెను) సర్వాత్మరూప, విరాట్ పురుషప్రకారుఁడగు ప్రజా పతిని "నేను" అని పలికెను. కావున అతఁడు 'నేను' పేరుగలవాఁడు అహన్నాముఁ డయ్యెను. వాని యీ యహంభావము లేక అహం కారము మిగిలిన సర్వవిధభేదోత్పత్తికి మూలకారణ మయ్యెను. బ్రహ్మము నిర్గుణము భాగములులేనిది. మార్పులులేనిది. నిర్వి కార మైనది. ఏకమై రెండవది లేనిది. ఇది పారమార్థికసత్యము. ఐనను దానియందొకశక్తి కలదని శాస్త్రము చెప్పినది. అదే మాయాశక్తి. "యామా (భూత్ పరమార్థతః) సా మాయా" ఏది పరమార్థముకాదో అది మాయ. అనఁగా నిజముగా కేవ లాత్మకన్న వేఱుగా వస్తుత్వము లేనిది. ఆమాయాశక్తి యెప్పుడు ఆత్మకానిది. కాని ఆత్మ లేకుండ స్వతంత్రముగా తాను లేనిది. అదే మిథ్యాస్వభావము. బొత్తిగా లే దని చెప్పుటకు వీలు లేనిది. దానివలన ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు, వివిధ జీవులతో గూడినప్రపంచము వచ్చి కొంతకాలము నిలిచి, తిరిగి యందే లయమగుచున్నట్లు ఆద్యంతములు లేకుండ సాగుచున్నట్లు కనఁబడును. ఇదంతయు నిమాయాశక్తి ప్రభావము. మార్పులేని సత్పదార్థము మాఱుచున్నట్లు అజ్ఞులగు సంసారులకు కనఁబడును. బొత్తిగా లేనిది వచ్చిన దనుటకే వీలు లేదు. అందువలన ఆశక్తి అనిర్వచనీయ మైనది. అవ్యాకృతముగా ఉండి (అదే) తరు వాత అనేకము (నానా)గా, వైవిధ్యముతో ప్రపంచాకారముగా వ్యాకృతమై నామరూపములతో వచ్చినట్లు కన్పడఁబడును. [Unmanifested (మాయ) manifested అగును] ఈమాయాశక్తి యే అవ్యాకృతము, మూలప్రకృతి, ప్రకృతి, అవిద్య మొదలగు

పేర్లతో నామరూపపరిస్థితులను బట్టి చెప్పఁబడును. కేవల చిన్మాత్రము, చైతన్యము, (జ్ఞానమే) సత్తే స్వరూపముగా గలది. సచ్చిదానందరూపబ్రహ్మము. అది సత్ వస్తువు. అది యట్లే యుండగనే, దానియందు మాయ, పరిణామశీల, తోఁచును. త్రిగుణాత్మకమైన ఒక (విషయము) వస్తువు మఱొకటిగా మాఱుస్వభావము కలదిగా తోఁచును. ఇది వేఱొకటిగా మారుట, కావున- సదాభావముగల బ్రహ్మము లేక కేవలాత్మయే, ఈ మాయాశక్తియేఉపాధిగాఁగల దైనట్లు భావించినప్పుడైనది. ఈశ్వరతత్త్వము మాయకు పైది. సర్వజ్ఞమై, ఆమాయను నిత్యము తనవశమం దుంచుకొనఁ గలది. ఇట్లు మాయ, శక్తి, ఈశ్వరుఁడు, శక్తిమంతుఁడు. మాయావి ఈశక్తి శక్తిమంతులు వేఱుకాదు. ఈరెంటికి అవినాభావసంబంధము. ఇది శాస్త్రనిర్ణయము. ఆ యీశ్వరతత్త్వము, వస్తువు కాలము, దేశములచే మితిలేనిదిగా నున్నది. అనాద్యనంత మైనది. ప్రపంచసృష్ట్యాదులకు నిమిత్తోపాదనకారణమైనది. సదాశివ, నారాయణ, శ్రీకృష్ణ, లలితాదేవి మొదలగు పేర్లతో భక్తుల కోర్కెలఁ దీర్పఁగలది.

అవ॥ బృహదారణ్యకోపనిషత్తు 1-4లోని మొదటిమూడుమంత్రరూపమగు యాజ్ఞవల్క్యమైత్రేయీసంవాదార్థమే యీక్రిందిశ్లోకములలో సంగ్రహముగాఁ జెప్పఁబడుచున్నది.

ద్వేధైవ భాతి తస్మాత్పతిశ్చ పత్నీ చ తౌ భవేతాం వై।
తస్మాదయ మాకాశః స్త్రియైవ పరిపూర్యతే సతతమ్॥ 96

సోఽయ మపీక్షాం చక్రే తతో మనుష్యా అజాయన్త।
ఇత్యుపనిషదః ప్రాహు ర్దయితాం ప్రతి
యాజ్ఞవల్క్యోక్త్యా॥ 97

ప్ర : సః = ఆనేను పేరుగల (ప్రథమశరీరుఁడు) ద్వేధా ఏవ = స్త్రీ శక్తి, పురుషశక్తిమంతుఁడు రెండుప్రకారములుగా (ఇద్దఱుగానే) భాతి = (భేదముగా) ప్రకాశించుచున్నాఁడు, తస్మాత్ = కావున, ఆపురుషునినుండి పతిః చ = భర్తయును, పత్నీ చ = భార్యయును, భవేతాం వై = అగుదురు గాక, ఇట్లు భార్యా-భర్తలసంజ్ఞలు రెండుగలవాఁడాయెను విరాట్పురుషుఁడు. తస్మాత్ = ఆయనవలన, అయం ఆకాశః = ఈయాకాశము, స్త్రియా ఏవ = ప్రకృతిస్త్రీచేతనే, సతతమ్ = ఎల్లప్పుడును, పరిపూర్యతే = చక్కఁగా అంతట పూరింపఁబడుచున్నది. సః, అయమ్ అపి, = ఈస్త్రీపురుషులజంట లో పురుషుఁడుగా విభక్తుడైన వానిపేరు మనువు. ఇతఁడుఁకూడ ఈ ఊంచ్రకే = సుఖింప ఆలోచించెను. ఆలోచించి, తనకంటెవేఱుగానున్న పత్నియగు శత రూపతో రమించెను,) తతః = ఆదంపతులనుండి, మనుష్యాః = మనుజులు (మనువునుండి పుట్టినవారు) అజాయన్త = పుట్టిరి. (ఆప్రథమదంపతులనుండి) ప్రజాభివృద్ధి ఆయెను,) ఇతి = అని (ఈపైవిషయము) ఉపనిషదః = బృహదారణ్యకోపనిషత్తులు (ఉపనిషద్వాక్యములు), దయితాం ప్రతి = తన భార్యయైనమైత్రేయినిగూర్చి, యాజ్ఞవల్క్యో = ఆమెభర్తయు, (యజ్ఞ వక్త) యగు హిరణ్యగర్భుఁడు లేక యజ్ఞమునికుమారుఁడగు యాజ్ఞవల్క్య మహర్షి వచనము (చెప్పినట్లుగా) ప్రాహుః = విస్తరించి, ప్రకటముగాఁ జెప్పినవి.

తా : అహిరణ్యగర్భుఁడు సత్యసంకల్పుఁడు గాన, సంసారరతిసక్తుఁడై రెండు విధములుగా స్త్రీభాగముగ పురుష భాగముగా తానే రెండుగా ఆయెను. ఒకే ద్విదళబీజమందలి విడి రెండుసమానదళములవలె పతియు, పత్నియు నను రెండు సగమేనులుగా విభక్తమైన ప్రథమదంపతులు, వారు. అందు వలననే భర్తయగు పురుషుఁడు, భార్యయగుస్త్రీ లేకుండ రతి సుఖము పొందలేఁడు. రెండవవారు లేనిచో వారుభయులు అసం పూర్ణులు. ఒకేబీజమొక్క (ద్విదళబీజములైన కంది, సెనగ, బఠాని

మొదటైన రెండు బద్దలు గలవి! రెండుసగము బద్దలవంటి వారు భార్యాభర్తలు. రెండవదానివలననే ఒక్కొక్కరు పరిపూర్ణతను జెందవలసినవారు. ఒకశూన్యశేషాకాశము రెండవసగమగు వారిచేతనే పరిపూర్ణమగును. అప్పుడే రతిఆనంద మిచ్చునదగును. ఒక్కరేయున్న అట్లుసుఖింపలేరు, క్రీడింపలేరు. రమింపలేరు. వారికలయికనుండియే ప్రజాభివృద్ధి కల్గుచున్నది. కాని ఇదంతయు వదలవలసిన సంసారవిషయమే గాని, తద్భిన్నమగు ముఖ్యాత్మ విషయముగాదు. ఈసంగ్రహవిషయమును ఆత్మోపదేశసమయమందు యాజ్ఞవల్క్యమహర్షి తనభార్యయైన మైత్రేయికిం జెప్పెనని బృహదారణ్యకోపనిషత్తులు చెప్పుచున్నవి.

గీతాప్రమాణవచనములు :

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా
మ్యహమ్।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత॥గీ 14అ_3శ్లో॥

శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు.

ఓభారత! అర్జునా! నాసంబంధమైనదే త్రిగుణాత్మికయు ప్రకృతియునగు మాయ. ఇది కార్యరూపములగు సర్వభూతముల యొక్క ఉత్పత్తికి (యోని) మూలకారణము. ఈమాయ, తన పరిమాణముచేత కడుమిక్కిలి పెద్దదియును (మహత్తు) తనసర్వ వికారములను బుట్టించి పోషణరూపమున భరించుచుండుటవలన బ్రహ్మమైనదియు, ఈయోని (మాయ) యే. విశాలతనుమై బృహత్తమమైన ఈప్రకృతియోనియందు హిరణ్యగర్భునిజన్మమునకు బీజమై సర్వభూతజన్మకారణమగు (గర్భము) బీజమును నిక్షేపించుచున్నాను. అనగా క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయశక్తిమంతుండగు ఈశ్వరుండైన నేను, అవిద్యాకామకర్మోపాధిస్వరూపాను

విధాయియగు క్షేత్రజ్ఞుని, క్షేత్రముతో సంయోగింపఁజేయుచున్నాను. ఇట్లు నాచేసినగర్భబీజనిక్షేపమువలన, హిరణ్యగర్భోత్పత్తిద్వారముననే సర్వభూతోత్పత్తియు అగుచున్నది

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥

గీ 14-4

ఓ కౌంతేయ! దేవపితృమనుష్యపశుమృగాదిసర్వయోనులందు దేహసంస్థానలక్షణములై కలియకట్టబడిన శరీరావయవములు గల వివిధాకారములుగల ఏయేమూర్తులు పుట్టుచున్నవో, వాని కన్నింటికి గారణమై క్షేత్రరూపావస్థలన్నింటిని పొందుచుండునది పైచెప్పిన మహద్బ్రహ్మయగు (మాయా) ప్రకృతియే (తల్లివంటిది) బీజప్రదుడను ఈశ్వరుఁడనగు నేను గర్భాధానమునకు కర్తనైన తండ్రిని.

అవ॥ మఱి యిదంతయుఁ బారమార్థికసత్యమా? కాదు. మఱిదెట్లు వచ్చినది? మాయవలన. అదెటువంటిదో వివరించుచున్నారు.

చిర మానన్దానుభవాత్ సుషుప్తి రివ కా ప్యవస్థాఽభూత్।
పరమాత్మన స్తు తస్మా త్స్వప్నవ దేవోత్థితా మాయా॥

98

ప్ర : (పైచెప్పిన సృష్టి సత్య మైనట్లు తోచును) తు = కాని, పరమాత్మనః = పరమేశ్వరునకు, చిరమ్ = చిరకాలము, ఆనన్దానుభవాత్ = ఆనందమును అనుభవించుటవలన, సుషుప్తిః ఇవ = నిద్రవంటిదైన కాఽపి అవస్థా = ఒకానొకయవస్థ, అభూత్ = ఆయెను. (కల్గెను). తస్మాత్ = ఆయవస్థవలన మాయా = త్రిగుణాత్మికయగు మాయ, స్వప్నవత్ఏవ = కలవంటిదిగానే ఉత్థితా = లేచెను,

తా : వ్యష్టిజీవునకు జాగ్రత్స్వప్నసుషుప్తు లని మూఁడవస్థలు కలవు. అందులో నిద్రావస్థ పూర్ణానందానుభవమే కాని ఏమియుఁదెలియ దను నజ్ఞానానుభవ మందుఁ గలదు. నిత్యసర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడు నిత్యజ్ఞానానందస్వరూపుఁడు. ఆయనకు చిరకాలానన్దానుభవము (జీవునకు నిద్రవలె) సాగి కలవంటిదే యైన మాయ సృష్టిచ్ఛతో వ్యక్తమయ్యెను.

అవ॥ సర్వసృష్టికి ఉపాదానకారణమైన మాయాశక్తి స్వరూపమును వర్ణించుచున్నారు.

**సదసద్విలక్షణా ఽసౌ పరమాత్మసదాశ్రయా ఽనాదిః।**
**సా చ గుణత్రయరూపా సూతే సచరాచరం విశ్వమ్॥ 99**

ప్ర : అసౌ = ఈమాయ, సత్, అసత్, విలక్షణా = సత్(ఉన్నది) అసత్ (లేనిది) అను రెండుభావాభావములకు వేరైన స్వరూపము కలది అనిర్వచనీయ. అనఁగా ఉన్నదని కాని, లేనిదని కాని, చెప్పుటకు వీలులేనిది, పరమాత్మ + సదా + ఆశ్రయా = పరమేశ్వరునే యెల్లప్పుడు ఆశ్రయించి యుండునది, అనాదిః = మొదలెప్పుడని నిర్ణయింపరాని, గుణత్రయరూపా = సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడుగుణములసముదాయము స్వరూపముగా గలది. సాచ = మఱియు, ఆమయాశక్తియే సచరాచరం = కదలునవి కదలలేనివి యగు వస్తుసంచయముగల, విశ్వం = సర్వప్రపంచమును సూతే = (కనుచున్నది) ప్రసవించుచున్నది.

తా : ఈమాయాశక్తి విచిత్రమైనది. అది యున్నదని చెప్పుటకు వీలులేదు అది లేనిదని చెప్పుటకుఁ గూడ వీలులేదు. అదెప్పుడు పరమేశ్వరు నాశ్రయించియే యున్నది. దానికి పుట్టుక యెన్నాఁడని నిర్ణయింపఁబడ రానిది. అది సత్త్వ, రజస్తమస్సులను మూఁడుగుణములు స్వరూపముగాఁ గలది. స్థావర జంగమరూపమైన యీదృశ్యమానసర్వప్రపంచమును సృజించు చున్నది.

శ్లో॥ అస్తి భాతి, ప్రియం, రూపం, నామ, చేత్యంశపఞ్చకమ్।
ఆద్యం, త్రయం, బ్రహ్మరూపం, జగద్రూపం తతో
ద్వయమ్॥ వాక్యసుధ-20

ఉన్నది, ప్రకాశించుచున్నది, ఇష్టమైనది, నామము, రూపము ప్రతివస్తువునందు ఈయైదుభాగములు సముదాయరూపముగా గలవు. అందు మొదటిమూటిసముదాయము బ్రహ్మస్వరూపమును, మిగిలినవి రెంటిజంట ప్రపంచరూపమును (మాయాకార్యమును) దెల్పును. ప్రతివస్తువునందు మాఅనిభాగమగు సద్రూపమును, మాఉభాగమగు నామరూపగుణములు కలవు. వెండిచెంబు వెండికంచము వెండికమండలువు అని చెప్పినప్పుడు మాఅనిద్రవ్యము వెండి. నామరూపగుణములు కంచము చెంబు, కమండలువు మొదలైనవి వానిఆకారములు మాఉనవి. కంచమన్నదానిని చెంబనము, చెంబన్నదానిని కమండలు వనము. అట్లే కంచమురూపము చెంబునకులేదు, చెంబురూపము కమండలువునకు లేదు. కాని ఈపేర్లకు ఆకారములకు వస్తుత్వము వానిఉపాదానకారణమైన వెండియస్తిత్వముకంటె వేఱుగా లేదు. అనగా వీనికి స్వతంత్రమైన యునికిలేదు. ఎల్లప్పుడు నివి వెండియునికిని నాశ్రయించియే (వెండిమీదనే ఆధారపడి) యున్నవి. అయినప్పటికిని ఈనామరూపములు బొత్తిగా లేవనుటకు వీలులేదు. వానికి ప్రత్యేకరూపము, నామము,నీరు తెచ్చుట, మొదలగు ప్రత్యేకప్రయోజనములు, (గుణములు) కలవు. అందువలన నివి సత్తుకాదు, అసత్తుకాదు. ఎప్పుడును (వెండి) వస్తువు నాశ్రయించియే యుండును. ఇట్లే మాయాశక్తి సర్వదా దానికాశ్రయమగు (ఈశ్వరుడులేక) బ్రహ్మము లేకుండ లేదు. స్వతంత్రముగా దానికునికిలేదు గాన ఆమాయాశక్తిసత్తనుటకు వీలు

